శ్రీ

# సుభద్రావిజయ నాటకము.

శ్రీకుమారాభ్యుదయ, శ్రీకౌసల్యాపరిణయ, శ్రీమదాంధ్రవాల్మీకి
రామాయణాద్యనేకాంధ్ర గ్రంథకర్తలును, చెన్నపురి
రాజకీయ సర్వకళా పాఠశాలయం
దాంధ్రపండితులునై యుండిన

వావిలికొలను సుబ్బారావుగారిచే

విరచితము.

మూఁడవ కూర్పు.

చెన్నపురి.

పోల్లక్ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడినది.

1928.

శ్రీరామాయ నమః.

మొదటి కూర్పు

# పీఠిక.

శ్రీమచ్చెన్నపురీరాజకీయసర్వకళాశాలయందుఁ బట్టపరీక్షకై విద్య నభ్యసించుచుండిన మ-రా-శ్రీ, కో. లక్ష్మీనరసింహము, ప. వాసుదేవుఁడుగారులు నిమిత్తముగ నీ నాటకము బ్ర॥ శ్రీ॥ మ-రా-శ్రీ, వావిలికొలను సుబ్బారావుగారిచేఁ గ్రీ-శ. ౧౮౯౬-వ సంవత్సరమున రచియింపఁబడినది. ఆ యిరువురు విద్యార్థు లిందలియితివృత్తము విజయవిలాసమునందలి కథగ నుండవలయు నని కోరిరి. ఆ కాలమున నీ గ్రంథకర్తగారు దుస్సహవ్యాధిపీడితులై యస్వస్థులై యుండుటచే నెట్లెట్లో కొంతగ్రంథముక్తలేఖనముగ వ్రాయించి తక్కినగ్రంథము తామే వ్రాసి యత్యల్పకాలములో గ్రంథము సాంతముఁ జేసి వారి కిచ్చుటచే నావిద్యార్థులు తృప్తులైనను గవిగారికి మాత్రము సంతుష్టి లేక యుండుటను, దానికిఁ దిమ్మటఁ గవిగా రారోగ్యవంతులైనను వారికనన్య శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణరచనయం దుండుటచేతను, నిది వారిచే మూల వైవఁబడెను గాని నేను మాత్రము దీనికిఁ బ్రతి యొకటి వ్రాసికొని నా మేనల్లుఁడగు చిరంజీవి కొలిచెన కామశాస్త్రి బి. ఏ, కును, కీర్తిశేషులైన శ్రీమత్పనప్పాకము. అనంతాచార్యులు సి. ఐ. ఇ. విద్యావినోదులవారికిని వారిపుత్రులు ప. శ్రీనివాసాచార్యులు బి. ఏ. బియల్ గారికిని మఱికొందఱు పండితులకును గనఁబఱుప వారెల్లరు శ్లాఘనీయముగ నున్నదనియు ముద్రణార్హ మనియు సదభిప్రాయ మిచ్చిరి గాని యిప్పటికిని గవిగారికిమాత్రము ముద్రింప నిష్టము లేకుండెను. అటులుండ వారి రామాయణము ముద్రితమై వెలువడినపుడు కవిగారియనంతరమైన నీ గ్రంథము లోకంబున వెలయునుగాక యనియు, దీనియునికి లోకంబునకుఁ దెలిసినదైన నుండును గాక యనియు నాంధ్రవాల్మీకి రామాయణ ముఖపత్రంబునఁ గవికృతిగ్రంథంబులలో నీ నాటకముపేరు నితికించితి. అంతట నాంధ్రవాల్మీకిరామాయణముఁ జూచిన పలువు రీనాటకముప్రతులు కావలయునని కోరుటచే యథార్థవాదులు, నిర్మత్సరులు, ననసూయులు, రసజ్ఞులు, కవిగారిశ్రేయస్సు గోరువారునగు కవిభూషణ బిరుదాంకితులగు శ్రీపై లాద్దంకి లక్ష్మీనృసింహకుమార తాతాచార్యులవారు, ననేక నాటకరచనాధురంధరులగు బ్ర॥ శ్రీ॥ కోలాచలము శ్రీనివాసరావుగారు, మ-రా-శ్రీ, క. రామలింగారెడ్డిగారు ఏం. ఎ. (కాంటబ్) గారు, లోనగువారికిఁ గనఁబఱుప వారందఱు మేలైన యభిప్రాయముల నిచ్చి ముద్రింపవలసినదని కవిగారిని నిర్బంధింపఁగా వారి యందుఁగల గౌరవంపుబుద్ధిచే శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణమును నొంటిమిట్ట

శ్రీకోదండరామస్వాములవారికి సమర్పించిన నాటకవిషయంబు లోకంబున స్థిరపఱుపఁ ప్రస్తావన వ్రాసి, కవిగారు ముద్రింపఁ జేయకొనుట దీని నేను ప్రకటింపఁ గలిగితి ఈనాటకముఁ బఠించినవారు దీని రెండుమూర్తులను జదివినఁగాని యిందలిగుణము గ్రహింపరాదని యభిప్రాయ మిచ్చిరి ధ్వన్యర్థములు, వస్తువిశేషములు గుణాగుణములు చదువరు లగుపాఠకులే గ్రహింతురుగాక. ఈ నాటకోత్పత్తిగుఱించి మీ రెఱిఁగి నది తెలుపుఁ డని మ-రా-శ్రీ, కో. లక్ష్మీనృసింహము బి. ఏ గారి నడుగఁగా వారు వ్రాసి పంపినయుత్తరము దీనికి జతపఱిచితి.

తిరువల్లిక్కేణి,
21-2-11.

కొత్తపల్లె. వేంకటపద్మనాభశాస్త్రి.

శ్రీరామ.

బ్రహ్మశ్రీ, కొ. వేంకట పద్మనాభశాస్త్రులవారికి.

సుభద్రావిజయనాటకము యొక్క యుత్పత్తికి మేము కారణములమనియు, నా కారణమున మాపేరులు పీఠికయందుఁ గనఁబడవలసినదని మ॥ రా॥ శ్రీ॥, వావిలికొలను సుబ్బరావుగారు మీతోఁ జెప్పినారనియు, నావిషయమై మాకుఁ దెలిసిన విషయములు చెప్పవలసినదనియు మీరు గోరితిరి గనుక మేము చెప్పునది యేమన —

క్రీ. శ. 1906 వ సంవత్సరమున మేము రాజకీయ కలాశాలయందుఁ బట్టపరీక్షకుఁ (బి. ఏ.) జదువుచుంటిమి. అప్పుడు బ్ర॥ శ్రీ॥ రా॥ శ్రీ, వావిలికొలను సుబ్బరావుగారు మాకు నాంధ్రోపాధ్యాయులుగనుండిరి. వీరియొద్ద సర్వకలాశాలయందేకాక హిందూహైస్కూల్ నందును మేముచదివినవారమే వీరిబోధనమహిమము వలననే మాకాంధ్రంబునందు విశేషముగ నభిరుచిగలిగి పాఠ్యపుస్తకములేకాక యితరములైన తెనుఁగుపుస్తకములును విరామకాలములయందుఁ బఠించితిమి అట్లు మేము పఠించినగ్రంథములలో విజయవిలాస మొకటి. దానిని జదివినప్పుడు దానికథ ననుసరించి యెవరైనఁ దగినపండితులు దానిని నాటకముగ రచించిన బాగుండునని మాకుఁ దోఁచెను. మాయభిలాష తీరు టెట్లని యాలోచించుచు మాకు నుపాధ్యాయులుగ నుండుటయేకాక మాయందు మైత్రియుఁ బ్రీతియుఁగలిగిన నీకవిగారికి మాకోరికఁ దెలిపితిమి వారును మావిన్నపంబు నంగీకరించి యప్పుడే యీనాటకంబునకు విషయవిభజనసూచిక నేర్పఱిచి కొంతగ్రంథము మాచేతనే వారుచెప్పి వ్రాయించి దేహము వ్యాధి బాధవలన మిక్కిలి బలహీనముగనుండుటచేతఁ దక్కినది వారే

వ్రాసి మఱి 4 దినములలోఁ బెన్సిల్‌తో వ్రాసిన విడికాగితములకట్టను మాకిచ్చిరి. అంతశీఘ్రకాలములో మాకోరిక యట్లు సంపూర్ణముగ నెఱవేఱునని మాకలయందైన మేము తలంచినవారము గాము కాఁబట్టి యీగ్రంథమును జూచినపుడు మాకపరిమితానందము గలిగెను. మాయానందము వారికెఱుకపఱిచి మే మొక స్పష్టమైన ప్రతిని వ్రాసికొంటిమి. అయినను మాయభీష్టము నదేమియోకాని యచ్చొత్తింప వారికిష్టము లేకుండెను. వారిదివఱకును నాటకములు వ్రాసినవారుకారు. ఇదియే వారికిట్లైన సంకోచమునకుఁ గారణము. మేమెన్ని విధంబుల వేఁడినను వారి మనస్సు తిరుగదయ్యెను. ఇట్టి యుత్తమగ్రంథము లోకంబునకు బ్రకటమే యడఁగిపోవునో యని భయపడితిమిగాని మేమేమి చేయఁగలము. వారు రామాయణమున భాషాంతరీకరించుటచే ముఖ్యముగ నంచుకొని యుండుటను వ్యాధిచే బాధపడుచు మిక్కిలి బలహీనులై యుండుటను మిక్కిలి నొక్కి చెప్పఁజాలమైతిమి. జగత్ప్రసిద్ధమగు నుత్కృష్టకావ్యరత్నంబు దాని గొప్పతనము మనమునకుఁ దగిన తిగ లోకంబునకు గోచరించి దానంతటఁ బ్రచారంబుఁ గాంచె నయ్యెడ, సిరపఱకు జనులకుఁ గనుపడకుండఁ బోవనేమోయని మేము సందేహించిన యీనాటకంబు తప్పక ప్రకటింపఁబడునను ధైర్యము గల్గించుటకుఁ గారణమొకటి గలిగెను. శ్రీమదాంధ్రవాల్మీకి రామాయణముయొక్క ముఖపత్రమునందుఁ గవిగారి గ్రంథముల పట్టికలో నీనాటకము చేర్చఁబడియుండెను. ఇయ్యదివారి ప్రియమిత్రులగు మీరు పన్నిన సదుపాయమని యెంచితిమి. గ్రంథము వెలువడఁగానే గ్రంథములకై కొన్ని వ్రాయుట గలిగెను గాన గీర్తిశేషులగు నీ కవిగారు ప్రకటింప కూరకుండిరట యనావశ్యకమయ్యె. మీరు ప్రయత్నము పుచ్చుకొనకున్నచో నీగ్రంథము నుపయుక్తమైన లోకంబునకుఁ దెలియకుండును. ఆకారణముగాన నిట్టియుత్తమ నాటకంబు శిథిలమై యుండును. గ్రంథమును కట్టయుపాయము చెప్పించిన సనకును నాంధ్రలోకంబున దీనికిఁ బ్రచారముగలుగఁ జూచుభాగ్యము మాకుఁ గలిగించి నందునకును మీకుఁ గృతజ్ఞతా సూచకంబుగ నమస్కరించుచున్నారము. భగవత్ప్రసాదలబ్ధకవితాధారిణి నెంతయు నతిశయిల్లు నీకవిగారిట్టి నాటకంబుల నింక ననేకంబు లీయాంధ్రలోకంబునకుఁ బ్రసాదించుచుందురుగాక యను మాయాశ నెఱిఁగించుచు నింతటితో విరమించెదము.

ఇట్లు విన్నవించు విధేయులు,
కో. లక్ష్మీనరసింహము,
సు. వా. గ. దేశిక.

## మొదటి కూర్పున

## విజ్ఞాపనము.

ఈ నాటకమును బఠించి సంస్కరణంబులు సూచించి ముద్రాపితం బొనర్పఁ బ్రేరించిన కవిభూషణ బిరుదాంకితులగు శ్రీశైలాద్దంకి సమయోద్దండ కోలాహల లక్ష్మీనృసింహకుమార తాతాచార్యుల వారికిని, ననేక నాటక రచనాధురంధరులగు బ్ర॥ శ్రీ కోలాచలము - శ్రీనివాస రావుగారికిని, సర్వకళాపారీణులు రసజ్ఞులును నగు మ-రా-శ్రీ, క. రామలింగారెడ్డి ఎం ఏ. (కాంటబ్)గారికిని, విశేషము శ్రద్ధవహించి ప్రయాసపడి యీగ్రంథమును బ్రకటించిన బ్ర॥ శ్రీ॥ కొత్తపల్లి వేంకట పద్మనాభ శాస్త్రిల వారికిని కృతజ్ఞుఁడనై యభివాదనంబు లర్పించెద. బుధు లిందలి సర్వదోషంబుల క్షమింతురుగాక.

ఇట్లు విన్నవించు సుజనవిధేయుఁడు,
వావిలికొలను - సుబ్బారావు.

## ఈ నాటకమున వచ్చు పాత్రములు.

### పురుషులు.

ధర్మరాజు.
భీముఁడు.
అర్జునుఁడు (నాయకుఁడు)
నకులుఁడు.
సహదేవుఁడు.
ఉగ్రసేనుఁడు - యాదవరాజు.
వసుదేవుఁడు - సుభద్రతండ్రి.
బలరాముఁడు, కృష్ణుఁడు, సాత్యకి, గదుఁడు. } సుభద్ర సోదరులు.
దుర్యోధనుఁడు - కౌరవరాజు.
దుశ్శాసనుఁడు - దుర్యోధనుతమ్ముఁడు
కర్ణుఁడు - దుర్యోధను మిత్రుఁడు.
శకుని - దుర్యోధను మేనమామ.
విశారదుఁడు - అర్జునుపురోహితుఁడు. నాగకుమారుఁడు.
లంబోదర సిద్ధాంతి, జటాధర శాస్త్రి } మాయాబ్రాహ్మణులు.
సుకేతుఁడు - మాయాసారథి.
కమలనాభాచార్యుఁడు — (నాగకుమారుఁడు)
నారదుఁడు - (నాగకుమారుఁడు)
ప్రతాపసింహుఁడు, సంగ్రామసింహుఁడు, విక్రమసింహుఁడు, పృథుసింహుఁడు } గవనికావలి భటులు.
కోటభట్టు, కొండిభట్టు } బ్రాహ్మణబాలకులు.
ద్వారపాలకుఁడు భటులు బ్రాహ్మణులు తీర్థవాసి లోనగువారు.

### స్త్రీలు.

ద్రౌపది.
కుంతి - పాండవులతల్లి.
దేవకీదేవి - వసుదేవునిభార్య.
రుక్మిణి, సత్యభామ } కృష్ణునిభార్యలు.
రేవతి — బలరామునిభార్య.
సుభద్ర - (నాయిక)
శారద - సుభద్రచెలికత్తె.
మాలతి - రుక్మిణిదాసి.
ఉలూపి - నాగకన్య.
వర్గ - దేవతాస్త్రీ.
రాజకన్యకలు లోనగువారు.

శ్రీరామచంద్రాయ నమః.

# సుభద్రావిజయము.



( నాటకము. )



నాంది.

మహనీయ వేషుఁడు, విశిష్టజనస్తవనీయసద్యశో
ధామవిశేషుఁడుం, విజయధర్మదయాన్వితశీలపోషుఁడున్
శ్రీమహిళామనోబ్జసరసీరుహబాంధవుఁ, డొంటిమిట్ట శ్రీ
రాముఁడు, సాధుకోటికి నిరంతరభద్రవిధాయి గావుతన్. ౧

[నాంద్యంతమున సూత్రధారుఁ డాలోచించువానివలె
నిటు నటుఁ బరిక్రమించు చుండును ]

నటి—(ప్రవేశించి) ఆర్యపుత్రా! ఏదియో గొప్పకార్య మాలోచించు వారివలె నున్నారే?

సూత్ర—సమయజ్ఞురాలా! మేలు, నాతలంపుకొఁడ వచ్చితివి.

న—ఏమికార్యము?

సూ—ఈ యాశ్వయుజపూర్ణిమ శ్రీమదాంధ్రవాల్మీకిరామాయణ మీయేకశిలానగర శ్రీకోదండరామస్వాములవారి కర్పించిన శుభవాసర మని తజ్జ్ఞాపకార్థం బిందుఁ జేరినయభిజ్ఞుల నెల్ల నలరింప నేదేని నూతనరూపకంబుఁ బ్రయోగింపు మని మహాజను లాజ్ఞాపించిరి.

న—మీ రేమి విజ్ఞాపించితిరి?

సూ—మహాజనవాక్యంబు మాలతీమాల్యం బని యుంటి. †

న—ఇందఱయాదరణమునకుఁ బాత్రుల మగుట మనమే ధన్యులము. ఏరూపకంబుఁ బ్రయోగింప నిశ్చయించితిరో?

సూ—అది స్ఫురింపకయే భయముఁ గొని యున్నాఁడను.

నటి—భయ మేల?

---

† మాలతీమాల్యము - జాతిపూదండ. శిరస్సున ధరించునది మాల్యము.

సూ—కుందేటి వేఁటకుఁబోయిన బెద్దపులి యెదురైనట్లైనది. ఏదియో యొక రూపకము ప్రయోగించెదఁ గాక యని యెంచి యుత్తరునివలెఁ బ్రగల్భజల్పితములు పలికి వచ్చితి. ఇచ్చటిసభఁ గవిభూషణ బాలసరస్వతీత్యాదిబిరుదాంకితులును, ననేక కావ్యనాటకగ్రంథరచనాధురంధరులును, నానాభాషారూపక రసపానతుందిలచిత్తులును, నవరసరసికులును, నిండియున్నవారు. వీరి నెట్లు మెప్పింపవచ్చు?

న—మీ రుత్తరు లైనచో విజయభద్రావాప్తి దైవసంఘటితమే. చింత యేల?

సూ—మతిమంతురాలా! చక్కఁగ సూచించితివి. సుభద్రావిజయనాటకంబుఁ బ్రయోగింప సిద్ధపడఁ బొమ్ము.

న—సుభద్రావిజయము వావిలికొలని సుబ్బరాయకృతము గదా?

సూ—అవును.

సీ. తనపితృవ్యుని ఋణంబును దీర్ప శ్రీకుమా, రాభ్యుదయంబును ననిమ్మెఁ దొలుతఁ
దత్కృత్రికృతాశంకఁ దలఁగింప నొకపూఁట, రంగనాథశతంబుఁ బ్రాసెఁ బలికె
జనయిత్రిప్రేరణంబునను గౌసల్యావి,వాహంబు ఘటియించి వాసిఁ గాంచె
వలనొప్పఁగా భగవద్గీత ద్విపదగా, రచియించె సరసంపురచన మెఱయ
తే. నాంధ్రవాల్మీకి రామాయణాఖ్యకావ్య
వరముఁ గొనియాడె శ్రీరాముకరుణ మెఱయఁ
గృతులు లోకాంధ్రభాషాప్రకృతి కొనర్చె
సుబ్బరాయఁడు సజ్జనసుకవిహితుఁడు. ౨

న—ఆయనకు ధీమజ్జనరంజకరూపకరచనయందును నేర్పు గలదా? †

సూ—అది యే మట్టు లనెదవు?

చం. వరమతికౌశలంబు పరివర్తిలెనేనియు సాధుశీలికిం
దర మగు శ్లాఘ్యపద్ధతి నొనర్పఁగ నేకృతి నైన

న—అవును మీరు చెప్పినది నిక్కమే.

ఎట్లనఁ

గురులు రహించెనేని సతి కొప్పిడుఁ, గొండియ చుట్టు, వేణికా
భరమును గీలుగంటు సిగ వైచును గాదె మనోహరంబుగన్. 3

సూ—నీయనుభవమునకుఁ దగినయుపమానమే చెప్పితివి.

న—కవు లందఱు ననుభవగతంబులనే కద గ్రంథంబుల వచించుట?

---

† ఈగ్రంథకర్తకు దృశ్యప్రబంధరచనయందు నేర్పుచాలదనిన యొకవృద్ధనర్తకుని యధిక్షేపోక్తియే యీనాటకరచనకు ముఖ్యకారణము.

సూ—అది యటు లుండ నిమ్ము. నీవు ప్రయోగసన్నాహంబున నున్నదాన వని నీ వేషంబే తెలియఁజేసెడి. మున్నే సర్వము సిద్ధపఱుచుట కేమి హేతువు?

న—నానాదేశంబులనుండి యనేక మహనీయులరాకయు దినవైశిష్ట్యంబును నాలోచించి నేఁ డిట్టికార్యము తప్పక తటస్థించునని యూహించితి. "నటీ యిటు ర"మ్మని మీరు తొందరపడి పిల్చునప్పుడా నేను దలలో దువ్వెన పెట్టుకొని రావలయున?

సూ—ప్రేయసీ! మేలు.

కం. మతిఁగతి నెఱిఁగి సముచిత, గతి నాయాసమయములను ♦ కర్తవ్యంబుల్
హితమతి బోధించుచు నిజపతికిం దోడ్పడునతియె ♦ భార్య యనంగన్.

కావున నీ శారద[1] నిశాకారణంబునఁ జంద్రచంద్రిక భద్రత వహించునట్లు నీకారణంబున నాకీర్తి లోకంబున మేలిమి గనును.

న—మేఘం[2] బడ్డపడ కుండినఁ గదా?

సూ—! ఏమీ! శరత్కాలచంద్రికకా? మనము భగవత్పాదాశ్రితులము. అజాతశత్రులము. మనపై నెవ్వఁడు ద్వేషించునే?

న—సుభద్రావిజయంబుఁ బ్రయోగింపఁ బోవుమీ రిటు లనుట పొసఁగదు.

చం. తనుఁ దమతోడివాఁ డని యు ♦ దారత నాకవనస్థ నిల్పఁగా
వినయమునన్ మహంబుఁ గనఁ ♦ బెద్దగఁ బిల్వసమున్నయుఁ జేసి త
ద్ధనయశముల్ హరించికొనఁ ♦ దంత్రముఁ బన్నిన [3]

సూ— వాని మాసదూ
రుఁడగ నొనర్చి యాశ్రితుస ♦ ద్రోహనె మాధవుఁడే కృపాంతిన్

నీ సందేహము తీఱినదా?

చం. భయపడ కబ్జనేత్ర! భగ ♦ వంతుఁడు సర్వవిధంబుల వంచకో
చ్చయము నశించుచున్ జయము ♦ సత్యశముల్ మన కిచ్చుఁ దానుగా
నయగతి నాథుమూలముగ ♦ నాశ్రితపత్నులుఁ దల్లిదే ధనం
జయుకడకున్ గనుం బనిచె ♦ శౌరియె భద్రకుఁ బంపుఁ గాన్పఁగన్.

ఇఁక మన మాలసింప రాదు పోదము పద

(నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

---

† శారద = సుభద్ర చెలికత్తియ. సుభద్రకు భద్రయనియుఁ జేరుగలదు. 2 మేఘము = వృద్ధనటుఁడే 3 వృద్ధనటుని చర్య. 4 భద్రాకరము. సుభద్రహస్తము.

## ప్రథమాంకము - ప్రథమరంగము.

[ఇంద్రప్రస్థపురము. అర్జునమందిరము. గదార్జును లాసీనులై యుందురు]

[తెరలో మాగధుఁడు.]

తే॥ పాండురాజతనూభవా ♦ ఖండయశము [1]
పుడమి నిండార వెన్నెల ♦ పులుఁగు మోద
గరిమ మిన్నంటెఁ గ్రొవ్విరి ♦ కలువకన్నె
ధవళకరునకుఁ దెలుపఁగఁ ♦ దలఁచి యిపుడు.

అర్జు—గదా! వింటివా మాగధునిమాటలు? మాయన్న గారు చంద్రకాంతికి స్వయశం బామ్రేడితంబుఁ జేయు చున్నవారు.

గదు—అర్జునా! మాగధుఁడు సత్యముఁ జెప్పెను గాని యది నీకును నన్వయించును.

అ—రాజుగారి యెదుటఁ దారకల మగుమేము వెన్నెల యగుదు మేని యాయన చంద్రుఁడే. అది యట్టు లుండ నిమ్ము. నీవు దేశ సంచారముఁ జేయుచు నిట వచ్చితి నంటివే తీర్థ సేవకై పోయి యుంటివా?

గ—తీర్థ సేవకుఁ గాదు. క్షేత్రసేవకుఁ గాదు. కన్యార్థమై.

అ—ఎవరికి?

గ—నాభార్య సోదరునకు.

అ—కన్నియ కుదిరినదా?

గ—మనస్సులు కుదిరినఁ గదా.

అ—ఎవరికి?

గ—పెద్ద వారికి

అ—భిన్నాభిప్రాయులా?

గ—కాకున్న నాకీ దేశాటనశ్రమ మేల?

అ—అన్ని దేశములు దిరిగితివా?

గ—కొన్నియే ఇంతలో "నీవు యుధిష్ఠిరపట్టాభిషేకమునకుఁ బొమ్ము. అచ్చటికి వచ్చురాచకన్నెల నందఱఁ జూడుము. నీ చూచి వచ్చిన వారిలో నుత్తమురాలెవ్వతెయో ధర్మజవిజయులయభిప్రాయ మెఱిఁగి రమ్ము. మాగధుభయంబునఁ

1 పాండురాజ - తనూభవ; పాండు-రాజ-తనూ-భవ; పాండుః-అజతనూభవ(శ్రీరామ)అని పదవిభాగము.

బురరక్షణార్థంబు బలరామకృష్ణులు నిలిచిరి. తక్కినవా రెల్ల నచటికిఁ దరలిరి" యని లేఖ వచ్చుట నే నిట వచ్చితి.

అ—వివాహోత్సవాదులు కన్యావరాన్వేషణతత్పరుల కుచితసమయములు గదా?

గ—కావుననే నే నిట రాక. కన్యల నెల్లఁ జూచి నీయభిప్రాయంబుఁ జెప్పుము.

అ—వైవాహికకార్యంబులఁ బరాభిప్రాయంబు నిష్ఠురకారణంబు.[1]

గ—కులవృద్ధులయాజ్ఞ?

అ—అనుల్లంఘనీయము.

గ—ఇఁక జెప్పిన ఫలమా?

అ—అడిగినప్పుడు బుద్ధిబుద్ధిఁ జెప్పవలసినదే. జంకేల? నీవు చూచి వచ్చినవారిలో నెవతె మేలు?

గ—ఇవో నాచూచివచ్చిన కన్నెల పటములు. వీ రందఱు నభిజాతలే. అందఱు రూపవతులే కొందఱు ప్రాయవతులు.

అ—(చూచి) ఇందు నీ కెవతె మేలుగఁ దోఁచెను.

గ—అందఱు కులజలు సుందరులు గాన నందఱుఁ గ్రాహ్యలే అయినను నామనస్సొక విషయమున నుయ్యాల లూఁగు చున్నది.

అ—ఏ మది?

గ—ఇదో, దీనితండ్రి భూలోక కుబేరుఁ డని ప్రసిద్ధి. దీనిని గ్రహించిన వలసినప్పుడు ధనసాహాయ్యమునకు లోప ముండదు. (వేఱొకపటముచూపి) ఇది బహుబాంధవ, దీనిని గైకొనిన యుద్ధసహాయులు పెక్కు రుందురు. (మఱియొకపటము చూపి) ఇది యత్యంతసుందరి, గృహదీపము, దీనిమొగము చూచుచుండినను జాలు, మనస్సున కానందము, నలువురిలోఁ బ్రతిష్ఠ........................

అ—అపూర్వబుద్ధిమంతుఁడా![2] చాలుఁ జాలు నీవిమర్శన జ్ఞానప్రకటనము.

గ—ఏమి బావా!

అ—వరణీయగుణము లివియా?

ఉ. భూరిధనాశ, బంధువులఁ బ్రోవును బ్రాపును సేకరింప, స్వా
గార మలంకరింపఁ, గలిఁ గాఁచి యొసంగఁగ, నిల్లు చిత్తగాఁ
గోరక, మేల్పొలిష్ఠకయి కోరినవిత్తము లిచ్చి, యైనయా
పేరునమాత్రఁ బెండ్లి యగు పెండ్లియుఁ బెండ్లియె బంధుసత్త్వమా? ౧.

1. కఠినస్వానుభవో [illegible]. 2 అబుద్ధిమంతుఁడా యని. అకారము పూర్వ్యమందుఁగల బుద్ధిమంతుఁడు.

గ—కా కున్న ?

అ—కులరూపప్రాయములును శీలస్నేహ శుభ లక్షణములును.

గ—ఇవి పుష్పితవాక్యములు.

అ—సారవంతములు ఫలవంతములును.

గ—ఎట్లు ?

అ—జనకులయాచారము కన్యాశిక్షవిధ మెఱింగినఁ గన్యాశీల మెఱుంగనగు; దృష్టాంతము సీతాదేవి. పరస్పరగుణరూపశ్రవణాదుల స్నేహమెఱుంగ నగు ; నలదమయంతులవలె. లక్షణమో—ముఖదర్శనమాత్రవేద్యము.

గ—అపవాదములు విధులు గావు. సీతాదమయంతులమాట లేల ?

అ—అటు లున్ననే బాగు.

గ—(సోత్ప్రాసముగ) నీకుఁగాని యట్టికన్య కుదురదు. ఆమాటలు పోనిమ్ము, లక్షణంబులఁబట్టి యీ దెవ్వతె గ్రాహ్యయో చెప్పుము (ఒకపటము నిచ్చును)

అ—నామతము నీకు సమ్మతమా?

గ—పెద్దవారి కగుఁ గాక.

అ—అట్లైన వినుము. ఏ రంభలు శుభలక్షణవతులే యైనను

ఉ. పాపము దప్ప దీచెలిని బత్నిగఁ గైకొనువానికిన్, మన
స్తాపము దప్పఁ బోదు హితజాలముతో, గృహ మన్న భీతియౌఁ,
జేపదు దుర్యశం బెపుడుఁ జిత్తము గానదు స్వస్థభావమున్.

గ—బావా ! నీవు కుశాగ్రబుద్ధివి ఆఁడుదానిపటముఁ జూచి మగవానికథఁ జెప్పుచున్నాఁడవు.

అ—అత్రిగాఁడా !

కోపన భార్యగాఁగఁ గయికొన్ననరుండును సౌఖ్యవంతుఁడే ?

గ—అది పోనిమ్ము. ఇది (అని మఱియొకపటము నిచ్చును )

అ—(చూచి).

మ. తళుకుంజేతలఁ బ్రొద్దుఁ బుచ్చు, నిజసౌందర్యప్రభూతస్మయా
విలతన్ దేహము తోము, దువ్వఁ గురులన్, వేణీభరం బల్లఁ, జూం
గులు మార్పన్, దనుఁ దానఁ జూచుకొనఁ, గొంకుం దీర్పఁ, గుల్కంగనే,
యిలు దిద్దంగ విరామముం గనదు చుమ్మీ యామృగీనేత్రయున్. ౧౦

1. అపాతరమణీయము. ఆ. కొంచముకాలము శోభించునవి,

క—ఏల ?

అ—ఇది సుందర మానిని. [1] అమ్మక పురంగు బొమ్మవోలె వన్నె మాయక యుండుటయే దీనికిఁ బరమార్థము. ఇట్టిది మగనిసుఖదుఃఖము లేమి విచారించు ? సంసారము నేమి సవరించు ?

క—ఇది యెట్టిదో చూడు (అని మఱియొకపటము నిచ్చును.)

అ—(చూచి) ఇది పతి కప్రతిష్ఠయు దుఃఖముఁ దెచ్చును.

క—ఏల ?

అ—చం. పతి ధన మిచ్చునాఁడు ముఖ ◆ వైఖరిఁ జూపుఁ బ్రసన్నతన్, వృథా
స్థితి ధన మీనినాఁడు తనుఁ ◆ దిట్టుకొనుం, బతి దూఱు, భుక్తిసం
చ్యుతిఁ దలఁ బట్టు పెట్టు, గృహ ◆ మొక్కటి రెండుగఁ జీల్చు దొంగయై;
నతిధన లుబ్ధ యీచెలువ ◆ హాని ఘటింపదె ప్రాణభర్తకున్ ?
(అని పటము మరల నిచ్చును.)

క—ఇది? (మఱియొకపటము నిచ్చును.)

అ—(చూచి)

తే. మట్టు మర్యాదఁ దలఁపదు ◆ గుట్టు చెఱచు
నిజకులాచారవర్తన ◆ నీటఁ గలుపు
సర్వవేదిని నని పొంగు ◆ జ్ఞాన మేది
యపయశముఁ దెచ్చుఁ దనకును ◆ బ్రాణపతికి. ౧౨

క—కారణ మేమి ?

అ—పండితమానిని, అహంకారమత్త, మఱి యేమి కావలయు ?

క—ఇది యిట్లు కా నేల ?

అ—కులవృద్ధులశిక్షలకు లోఁబడి పెరిఁగినది కాదు.

క—ఈపటముఁ జూడుము. (అని మఱి యొకటిచ్చును).

అ—(చూచి) ఇది 'భర్తాభార్యా పరస్పర' మ్మనుటకు లక్ష్యభూతురాలు. [2] (అర్జునుఁ డాలకించుట నభినయించి) మీవిడిది మేడమీఁద నాటలపాటలధ్వనులు విన వచ్చుచున్నవి. ఏ మైన యుండును ?

క—(కిటికీనుండి తొంగి చూచి) నాయుద్దేశము సులువుగ నెఱవేఱెను. ఇటు రమ్ము

అ—ఏ మది ?

---

1. తాను సుందరినని తలంచునది, నిజముగా సుందరి గాదు. 2. ఉత్తరక్రియలకుఁ గొడుకులు లేనిదని యర్థము.

గ—"వసంతోత్సవకాలము కావునఁ బెక్కుఱు కన్యక లొక్కచోఁ గూడుట నీరాత్రి మన మేడమీఁదఁ బండువెన్నెలలో మదనపూజ నిర్వహింపవలయును. అందఱి రాజకన్యకల నిటకు నాహ్వానింప వలసిన" దని మావదినెగారు సత్యాదేవి యాదవకన్యకల కెల్లఁ జెప్పు చుండిరి. వారియాలోచన కార్యరూపముగఁ బరిణమించిన ట్లున్నది. అనేక కన్యకలు గుమిగూడి యాడుచున్నారు. ఇట్లు వచ్చిచూచి వీరియం దెవతె యుత్తమురాలో నీకు మెచ్చైనవతెయో చెప్పుము?

అ—(చూచి చూచి) నీశ్రమము ఫలించినది పో.

మ. తళుకుం బంగరుఁ జెక్కుటద్దములపైఁ • దాటంకరత్నద్యుతుల్
కులుకన్, వెన్నెల కొక్కవన్నె నిడుచా • లుంగల్లు క్రొంబట్టదు
వ్వలువం గాంచనకాంచి గ్రాల, జలజా • భం బైనచోళంబు నా
కలికిం బోలెడికన్నె గల్గ దెట లో • కంబందు బంధూత్తమా? ౧౩

గ—లోకమందే లే దంటివా? మేలు. తక్కినవారియం దున్నతళుకు బెళుకులు గూడ నీకన్నెయందు లేవే యేమి విశేషముఁ గాంచి చెప్పితివి?

అ—నీకుఁ గన్నులు లేవు.

సీ. చూడవా శాంతమై • శుద్ధమై కాంతమై, ముద్దులు గులికెడి • మోము దమ్మి?
కానవా సోఁగలై • కందర్పతూణులై, గొనబారు కాటుక • కనులసొంపు?
కనలేవె నూఁగుబొమ్మ • లను నవ్వుమవ్వమై, సంపెఁగఁ బోలిన • చాయునాస?
తోఁపదా నిద్దమై • తులకించునద్దంబుఁ, బోలినహారిక • పోలతలము?

తే. కనుబొమలతీవ నమృతంబుఁ • జినుకు మోవి
వ్రేళ్ల చెలువారు లీరును • గోళ్ల సోరుఁ
జరణములపొందుఁ గనుఁగొన్న • శారదేందు
వదన సన్నుతభద్రాంక • సదన సుమ్ము.[1] ౧౪

తే. వినయగరిమను గాంభీర్య • విభవమునను
వలపు పెంపున సద్గుణ • వారములను
నీతిసంపదఁ దనవిభు • ప్రీతిఁ బడసి
యిహపరంబుల సుఖముల • నిడును బతికి ౧౫

గ—అట్లైన నిది?

అ—అవశ్యగ్రాహ్య.

---

ఇది సాముద్రికశాస్త్రమువలనఁ దెలియఁదగినది. గ్రంథవిస్తరభీతి వివరింపఁబడదయ్యె.

గ—అర్జునునభిప్రాయ మిది యని మావారికిఁ జెప్పుదునా ?

అ—తప్పక చెప్పుము.

గ—నీ వైన దీని గ్రహింతువా ?

అ—నామాట యేల ? పెండ్లి పెద్దలందఱు పెండ్లికొడుకులు కావలయునా యేమి ?

గ—నీకు మాత్ర మవశ్యగ్రాహ్య కాదు కాఁబోలు ?

అ—లభ్యపడు నేని యేపురుషున కైన నిది మందారప్రాలంబము. [1]ఈకన్నియ యెవతె?

గ—నీవు దొంగతనముగాఁ బోయి తెచ్చుకొనుటకా ?

అ—ఎంతటి సంశయచిత్తుఁడవు! అతిశంకియే యవశ్యవంచితుఁడు.

గ—కన్య యుత్తమురాలని నే నెఱుంగుదును. అది మాబావగారికి లభ్యపడుటయే దుష్కరము దైవ తంత్ర మెట్లున్నదో.

అ—కృష్ణుఁడు పూనిన విజయసిద్ధికి సందేహమా? ఈకన్య యెవతె?

గ—మరలఁ జెప్పెదను. రాజుగారిపట్టాభిషేకోత్సవదర్శనార్థ మై యెల్లరు సిద్ధపడుచున్నారు. ఉదయము కావచ్చెను. నేను బోయెద.

(స్వగతము)

ఉ. చేసితి దేవకీసుతుఁడు ♦ చెప్పినభంగిని సర్వ మీయెడన్,
వాసవియంతరంగమున ♦ నాటితి లెస్సగ స్నేహబీజమున్,
భాసురగాత్రియందితఁడు ♦ బంధురమోహవశాత్ముఁ డయ్యె, నే
నాసడిఁ గంటిఁ, గృష్ణునకు♦నంతయుఁ జెల్పఁగ నిష్క్రమించెదన్.(నిష్క్రి)

అ—అవును. అన్నగారు నాకొఱకు వేచి యుందురు. (నిష్క్రి.)



[ప్రథమాంకము - ద్వితీయరంగము.]

(పట్టాభిషిక్తుండైన ధర్మరాజు రథస్థుండై యర్జునుండు సారథ్యంబుసేయ, భీమనకులసహదేవులు ఛత్రచామరాదులుధరించి పార్శ్వంబులనిలువ, మహోత్సవంబుగ ననుగతసకలరాజన్యుం డై యింద్రప్రస్థపుర రాజమార్గంబునఁ బోవుచుండ, సత్యాసుభద్రలు మేడకిటికీ యందు నిలిచి చూచు చుండుదురు.)

సత్య—ఎన్నివంకరలు పోయినను గావడి వచ్చి యిల్లు చేరినది.

1 ప్రాలంబము - మెడను వేసికొను పూలదండ - అగుటచేఁ గొఁగిలింపరానిది.

సుభ—నిష్కారణముగ నీ వెన్నికష్టము లనుభవించితి. అయ్యోపాపము ! వదినె ! ఇవి యెంతవింతగుఱ్ఱము లమ్మా !

స—ఇవి దేవగంధర్వహయములు.

సు—వీరి కెక్కడివి ?

స—అంగారపర్ణుఁడు మహాప్రబలగంధర్వుఁడు. భాగీరథీతీరకాననవాసి. జనభయంకరుఁడు. ద్రౌపదీస్వయంవరముఁజూడఁబోవు పాండవులఁ దద్వనమార్గ సంచారుల నర్ధరాత్రంబున నెదిరింపఁ జే నున్నకొంఅవి నభిమంత్రించి యర్జునుఁడు వాని దగ్ధరథుఁ గావించి, వానిభార్య ప్రార్థింప నందల విడిచెను. వాఁ డిచ్చిన వీ యశ్వంబులు.

సు—ఎంత సాహసము! ఎంత పరాక్రమము !

స—ఒక్కగంధర్వుని జయించినదే పరాక్రమమా ! ఆయేనుఁగును జూచితివా ?

సు—(అచ్చెరువునటించుచు) ఇదే మమ్మా యిట్లు లున్నది ? తెల్లయేనుఁగు. నాలుగు దంతములు. ఐరావతమా యేమి ?

స—అవును.

సు—ఇది వీరి కెట్లు లభ్యపడెను?

స—గాంధారీదేవిగారు గజగౌరీవ్రత మొనర్చు టెఱుంగుదువా ?

సు—వినుకలిచే. అప్పుడే గదా గారి దేవి వెండి కీలేనుఁగుపై నూరేగింపఁబడెనని పామరులు చెప్పుకొనిరి.

స—వీరాలి మీఁది పోటికి......

సు—తెలిసె - తెలిసె- మామేనత్తగా రావ్రత మాచరించిరి. మనకా హ్వానపత్రికలు వచ్చి యుండెను. అప్పు డైరావతమే వచ్చి యుండె నని యాశ్చర్యంబుగ మనవా రంద అనుకొనుచుండిరి.

స—అదియే యిది.

సు—స్వర్గము నుండి భూమిమీఁది కెట్టు లీయేనుఁగు దిగెను ?

స—అర్జునుఁడు బాణములతో మెట్లు కట్టి దింపెను. మహాత్ముల కేది యసాధ్యము?

సు—సత్యము.

స—అంతటివానికిఁ గాకున్నఁ దపస్సుచేసి వరములఁ బొంది కౌమార్తెఁ గని యీ యన యిచ్చునా ?

సు——ఈయన ద్రుపదమహారాజుగారా?

స—అవును.

సు—ఇంతస్థూలోన్నతకాయు మహాబలవంతుఁ గౌరవుల కందఱకును నజయ్యుఁ డైన వాని నర్జునుఁ డొక్కఁడు పట్టి కట్టుట కాయన యెంతటివాఁడో?

స—(నవ్వుచు) లోకోత్తరకార్యసాధకు లందఱు స్థూలోన్నతకాయులనియా నీతలంపు?

సు—అంతటితపస్సువలన నా ద్రౌపదిదేవి పుట్టెను గనుకనే యర్జునుఁడు ప్రచ్ఛన్నుఁడుగ నైన వచ్చి వివాహము చేసికొనఁ గలిగెను.

స—తపోహీనులకు మహాఫలము గలుగునా!

సు—కలుగదు కలుగదు. నిజముగ మహాత్మ్యురాలే

స—(పెదవి విఱిచి) ఊఁ. ఏమిమహాత్మ్యురాలు లే.

సు—అదేమి వదినే[1] యట్లు లనెదరు?

స—ఎంతతపస్సువలన నమానుషవిధముగఁ బుట్టినను నైదుసంవత్సరముల కొకసారియే గద యర్జునుతోడి సంసారము? కలకాల మాతనిఁ గూడి యుండఁ గలిగినది యిఁక నెంతటి మహాత్మ్యురాలు? ఆయనను వివాహమాడ వలయు నని యెందఱో దేవకన్యకలు నాగకన్యకలు కూడఁ దపస్సులు ధారవోయు చున్నారఁట.

సు—భవిష్యజ్జన్మమున వివాహము కాఁ గోరియా?

స—ఈ జన్మముననే

సు—ద్రౌపది యుండ మఱియొకభార్య యాయన కేల?

స—పాండవు లందఱు ద్రౌపదియందలిసమయము నాలోచించుకొని వేఱు భామల వివాహ మగుచున్నారు మీబావలకు వేఱు వేఱు భార్య లుండుట యెఱుఁగవా? ఇఁక నర్జునునకు వివాహముకావలసి యున్నది.

సు—ఏకన్యకతపస్సు సఫల మగునో?

స—ఎవతెమోహము నిర్మలమో యెవతె దృఢసంకల్పయో యాకన్యకతపస్సు. అట్టిమనోబలముచేతఁ గదా ద్రౌపది యాయన నాకర్షించెను.

సు—అవును. అప్పు డర్జునుఁడు బ్రహ్మచారిగ నుండెను గనుక.

స—సంకల్పము సత్యము దృఢ మైనచో బ్రహ్మచారిగఁ గాదు సన్న్యాసిగ నుండిన నైన నాకర్షించును, అది పోనిమ్ము. మీబావగారులను నీ వెప్పుడైన నింతకు మున్ను చూచితివా?

---

1. వదిన-వదినె యన రెండు రూపములు గలవు.

సు -నే నెప్పుడు చూచినది లేదు. వారు ద్వారకకు రారైరి. మన మిచ్చటికి రామైతిమి. పరస్పరాలోకన మెట్లు లగు? నిన్న వచ్చినదిమొద లెవరిపనిలో వారున్నారము.

స—అదిగో రాజుగారితేరు. నీవును బుష్పములఁ జల్ల వలయుఁ జుమా.

సు—అట్టులే చేసెదను. ఇదిగోఁ దామరపూవు. దీని వేసెదను.

స—తేరు మనకు సరిగా వచ్చు చున్నది. వేయుము.

[సుభద్ర వేయును. అది యర్జునుపైఁ బడును.]

స—మఱఁదలా! నేను రాజుగారిపై వేయు మనిన నీవు సారథిపై వైచితివా? ఎంత తెలివి గలదానవే.

సు—నేను రాజుగారిమీఁదనే వేసితిని. అది తప్పి సారథిమీఁదఁ బడెను,

స—లక్ష్యశుద్ధి బాగుగానే కుదిరినదే.

సు—కాదమ్మా! పుష్పము లచ్చటఁ బడులోపల సారథి యున్నచోటికి రాజుగారు వత్తురు గదా యని యూహించితిని. తటాలున గుఱ్ఱములు నిలుచుటచే నవి సారథిపైఁ బడెను ఇంత తేజోవంతుఁ డగుసారథి యెవ రమ్మా!

స—రథము దాఁటి పోవును. మరల మాట లాడ వచ్చును. మఱియొక సారి రాజుపైనఁ బుష్పములం జల్లుము.

(సుభద్ర పుష్పములు గైకొనును. హస్తములు వణఁకును.)

స—సుభద్రా! ఏల నీకేలు వణఁకు చున్నది?

సు—ఏమో.

స—పూలు వేయుటకే యింతెలత్తఱపాటైన నిఁక నీ నేర్చిన విలువిద్య లేపికే?

(సుభద్ర పూలు వేయును. అవి మారుతవశమున నర్జునుపైఁ బడును)

స—(చిఱునవ్వున) ఔరా లక్ష్యశుద్ధి! సారథికి నీకు నేమోలంకె యున్నది పో.

సు—(ఇంచుకకోపమున) సారథికి నా కేమి లంకె? బాగున్నది, మీ మాట.

స—ఇప్పుడు చూడుము పంచపాండవులను. రాజుగారు నీ పెద్దబావగారు. ఛత్రముఁ బట్టినవారు నీ చిన్నబావగారు. చామరములు వీచువారు నీమఱఁదులు నకుల సహదేవులు. వీ రెంతబలపరాక్రమసంపన్నులు! ధర్మాత్ములు!

సు—నాలక్ష్యశుద్ధివలనే యున్నదే మీకు గణితశాస్త్రసిద్ధి.

స—ఏ మిది ?

సు—పంచపాండవులలెక్క పరిపోయినదా ?

స—అందఱుఁ జెప్పితిని గదా ?

సు—ఇద్దఱు బావ లంటిరి ఇద్దఱు మఱఁదు లంటిరి.

స—ఎంతముగ్ధవే సుభద్రా! తక్కిన వా రెవరో యంతమాత్రము గ్రహింపలేవా ? సారథియే యర్జునుఁడు

(సుభద్ర తెప్పపెట్టక చూచి చూచి తల యూఁచును.)

స—ఎవరి నట్లు చూచుచున్నదానవు ?

సు—రాజుగారిరథము వెనుకఁ బోవుమహాభాగ్యసంపన్నుఁడు విలక్షణపురుషుఁ డెవ్వఁడు?

స—విలక్షణపురుషుఁ డేమిటే ?

సు—తక్కిన వారివలె నతఁ డున్నాఁడా ? చూడుఁడు

చం. వదనమునం బ్రసన్నత యభావము, భ్రూకుటి నాసమూలమున్
గదిసెను, వక్రవీక్షణము కంధర యించుక యోరగిల్లెడిన్,
మదమును ముదంబు లేమియును మానస మెగ్గునన్లు దోఁచెడిన్,
వదినెగా! యేల యీధరణీవల్లభుఁ డీగతి మోము మాపెడిన్ ? ౧౬.

స—ఇతఁడు వ్యాధిలేని బాధచేఁ బీడితుఁడు

సు—ఈర్ష్యావంతుఁడా ? సమస్త సమ్మానములతో రాజుగారికంటె మిన్నగ గౌరవింపఁబడుచున్నాఁడే. ఈర్ష్యకుఁ గారణము?

స—ఆత్మనైచ్యము

తే. పెద్దచేసిన, శిరముపైఁ బెట్టుకొనినఁ, గూళ యేటికి నిజనీచ గుణముఁ బాయుఁ?
బట్టుఁబుట్టంబునను జుట్టి భద్రపీఠి, నిడిన నీరుల్లి తనకంపు విడువఁ గలదె? ౧౭.

సు—ఈర్ష్యవలన నేమిఫలము రాఁగలదు?

స—మానహాని

సు—ఎవ్వ రీరాజుగారు ?

స—శకునిమేనల్లుఁడు.

సు—దుర్యోధనుఁడా ? అమ్మా! ఇంతటివాఁడు కాక యంతటికార్యము లొనర్చునా ? ఈ యనర్థదర్శను నేల నాహ్వానించిరో ? ఈ మాయలమారి యసూయా పిశాచగ్రస్తుఁ డీ వైభవముఁ జూచి సహింపఁ గలఁడా?

స—రాజుగారి తేరు దూరము పోయెను. మన యింటిలోనికిఁ బోదము పద.

(నిష్క్రాం.)

---

[ప్రథమాంకము - తృతీయరంగము.]

(హస్తినాపురసౌధమున దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకును లాలోచించుచుందురు.)

దుర్యో—తెలియనివారివలెన న్నేల తఱచెదరు ? ఊఁకార్పులు దుఃఖాగ్నికి ఏచోపులు సుఁడీ. అయిన వినుఁడు.

ఉ. పుట్టితి క్షత్రియుండ నయి ♦ భూరియశోవిభవాభిరామ మై
నట్టన కీర్తిఁ గన్న యువ♦నీపతివంశమునందు, నట్టిరా
పట్టిని, రాజరా జనఁగ ♦ వాసి రహించియు దేశె నైతి, ని
ప్పట్టునఁ గూటిపేద నయి ♦ పాడవమానము సైఁప నేర్తునే ?

దుశ్శా—అన్నా ? "పాండవమానము సైఁప నేర్తునే" యనుము. ౧౮.

దు—దుశ్శాసనా ! నిజంబ పలికితివి. పాండవు లర్ధరాజ్యంబుఁ బంచుకొనుట,నా...

శ—న్యాయము విచారింప రాజ్య మంతయు వారిదే కదా ? దానికై నీ కేల యింత విచారము ? 1

దు—న్యాయము బురదలోనికంబము. అది యట్టు లుండ నిమ్ము. సంతుష్టుఁ డగు పార్థివుఁడు నశించునని కలదు గదా ? కావున నారాజ్యాభిలాషంబు దోషంబా ?

శ—అది శత్రువిషయ మైనచో దోషము గాదు గాని భ్రాతలయం దగ్రజన్యాయం బనుసరణీయంబు గదా ?

దు—పాండవులు నాకు శత్రువులుగాక మిత్రులా ? "జ్ఞాతిశ్చే దనలేన కి" మ్మనుట మఱచితివా ?

శ—వా రెట్లు నీకు శత్రువులు ?

దు—అపకారమే యరిలక్షణము; మనస్సు నొప్పించుటే శత్రుత్వచిహ్నము.

సీ. జ్యేష్ఠసోదరుఁ డుండ♦ శ్రేష్ఠుండ నేనని, పాండుఁడురా జౌట♦యొండు వినుము
ధర్మరాజతనికిఁ ♦ దనయుఁ డౌటయె రెండు, ధ్మారుత శక్తిని♦గనుట మూఁడు
ధర్మచింత నరణ్యా♦తలముఁ జేరక సిరిఁ, గోరుచు నిట నుండు♦కోర్కి నాల్గు
ఏమిచేసియువారు♦హింసఁ గూరమిమైదు, క్రమముగ నభివృద్ధి ♦ గనుటయాఱు

---

1 శ్రీకృష్ణలీలామృతము ద్వితీయ చతుర్థము శ్రీకృష్ణుఁడు పాండవులకు గౌరవ సభయందలి వృత్తాంతము చెప్పు ఘట్టములఁ జూడుఁడు.

ఆ. ఇన్నికారణములఁ ♦ నేఁచుచు నున్నారు, రేపు కుడుపు నిద్ర ♦ మాపు లేదు
అరయ నిట్టివారె ♦ యహితులు గారేని, యహితు లెట్టివార ♦ లయ్య చెపుమ ?

మామా ! ఒకమాట వినుము. పాండవుల హింసించుటయందు, రాజ్యము సంపాదించుటయందు, నీ కిష్ట ముండిన నీచేత నైన సాహాయ్యముఁ జేయుము. లేకుండినఁ, గాకుండిన, నూర కుండుము. నీతర్కములు దిద్ది నన్ను బాధింపకుము.

శ—దుర్యోధనా ! ఇప్పుడు నీకోరున దేమి?

దు—లోక మపాండవ మొనర్చుట.

కర్ణు—(చివాలున లేచి) చం. కటకట! యింతమాత్రమున ♦ కా నభ మెల్లను ప్రీలినట్టిపైఁ
దటుకునఁ బడ్డయట్టులు వి ♦ తాకును గొంటివి కౌరవేంద్ర ! యు
ద్భటపటిపంక్తికంధరవి ♦ దారణ దారుణ మీకృపాణ, మీ
పటుతరచాప, మీనిశిత ♦ బాణము, లేమిగ నెంచినాఁడవో ? ౨౦

ఇదే చూడుము మత్కరవాలము - పాండవప్రాణానిలవ్యాలము. ఇదిగోఁ గోదండము - విపక్షులపాలిటి యమదండము రాజేంద్రా ! యివి యలంకరణార్థంబు ధరించితి నని తలంచితివా? నన్నిప్పుడె పంపుము పాండురాజు లుత్తపింపఁ జేయుఁ జేసెద.

శ—కర్ణా ! ఇవేటిమాటలు ? రణమున వారెంతసులభసాధ్యులని తలంచితివా ? ద్రౌపదీస్వయంవరంబున నీశౌర్య మే మాయె? మాయచేతనే వారిని రూపు మాప వలయు.

సీ. మాయచేతనె కాదె ♦ మయుఁడు పురాసుర, గణము నజయ్యంబు ♦ గా నొనర్చె?
మాయచేతనె కాదె ♦ మఘవారి[1] వాసవుఁ, గారాసిబద్ధునిఁ ♦ గా నొనర్చె?
మాయచేతనె కాదె ♦ మారీచుఁ డారాము, నంతటివాని నల్లాడఁ బెట్టె?
మాయచేతనె కాదె ♦ మాధవనందను, శంబరుఁ డంభోధిఁ ♦ జావఁ ద్రోచె ?
తే. మాయచేఁ గాదె జగము ని ♦ ర్మాణ మగుట ?
మాయచేఁ గాదె భువనముల్ ♦ మనుచు నుంట?
మాయచేఁ గాదె లోకంబు ♦ మడియు చుంట ?
మాయకును నీడు జోడు స ♦ మంబు గలదె? ౨౧
గోటఁ బోవుపనికి గొడ్డలి కా వలయు ననెద వేల ?

1. మఘవారి - ఇంద్రశత్రు.

క—శకునిమామా! లాక్షాగృహదాహంబున నీమాయ లేమాయెఁ గొంచెము చెప్పుము?

సీ. బలమదోద్ధతిఁ గాదె • బలి బలివాతెను, రణమున శాత్రవ • గణము నెల్ల
విక్రమంబునఁ గాదె • వృత్రాసురేంద్రుండు, నైరావతముతోడ • హరిని మ్రింగె
బింకంబునను గాదె • లంకేశుఁ డల్లల, నాడించె రౌప్యాద్రి • హరునితోడ
గురుశౌర్యమునఁ గాదె • నరకుండు హరిగెల్చి, యదితికుండలముల • నపహరించెఁ
తే. పౌరుషంబునఁ గానట్టి • పనియుఁ గలదె?
సాహసంబునఁ బోరాని • సరణిఁ గలదె?
పిఱికిపందలు కలహింప • వెఱచి కాదె
మాయల సమాశ్రయింతు ర • న్యాయవృత్తి? ౨౨

రాజ్యము వీరభోజ్యమా వంచకభోజ్యమా?

శ—కర్ణా! మాయ నీ కంతయేలిద మా...

దు—ఉ. తమ్మునిముద్దుఁ దీర్పఁగ ను • దారమనస్కుఁడు, జ్ఞానవృద్ధులన్
సమ్మతిఁ గొల్వఁ జేకుఱెన • సాధువిరాగియు, నేను చిన్న నా
తమ్ముఁడు చిన్న నే మనుచు • ధారుణిఁ బ్రోవఁగ నాదు తండ్రి దా
నిమ్మగఁ బాండునిన్ బిలుప • నెంతయనర్థము గూడెఁ గంటరే. ౨౩

దుశ్శా—ఎంతపాపము! ఎంతపాపము!

శ—ఊఁ. వచ్చునది కలికాలము గదా!

దు—దానం జేసి కదా యెచ్చటనో యెవ్వరికో పుట్టిన యుధిష్ఠిరుఁడు రాజ్యము తిన దినుచున్నవాఁడు. భీష్మవిదురాదులు పాండునందలి స్నేహభావంబునఁ బాండుపుత్రులపక్షమే చెప్పుచుందురు. అట్టు లగుటంబట్టి కాదె యిప్పుడు ధర్మరాజు రాజై యున్నవాఁడు. ఇప్పుడు రాజ్యభారంబు వహింప యోగ్యుఁడై నమాజనకుఁడు తొలుత నెట్లు కాఁడయ్యె? ఇది యేమి న్యాయము? భీష్మాదుల వంచనముకాక.

క—అవును. ఈ శకుని యాలోచనముచొప్పునఁ గదా యెక్కడనో యత్తగారింటఁ బడియుండినవారిని పీడనిబోవు శనైశ్చరుఁడా యింటిలోనికి రమ్మన్నట్టు తెచ్చి యింటఁ బెట్టుకొంటిరి.

దుర్యో—ద్రుపదీసంబంధంబునఁ బాండవులు బలవంతు లగుట యాలోచించి, భేదోపాయం బూహించి యిచట వా రుండిన నెట్లైన మట్టుఁబెట్టవచ్చు నని యెంచితిమి కాని రాజుగారిని వారికి నర్ధరాజ్య మిమ్మంటిమా ?

కర్ణుఁడు—ఇది యంతయు గతిజలసేతుబంధంబు.

దుర్యో—నీ రంతయుఁ బో లేదు, ఇంకను మనకార్యము సాధింప నుపాయ మున్నది.

దుశ్శా—ఏమియుపాయము ?

కర్ణుఁడు—రణము.

శకుని—మాయ

దుర్యో—చతురుపాయములలో సామము వైయర్థ్యము. దాన మగౌరవనిదానము. మూఁడవయుపాయ మనుష్ఠేయము. దాని కాలోచనముఁ జెప్పుఁడు. రణమునకు భీష్మాదు లంగీకరింపరు.

దుశ్శా—సామదానము లింతకుఁ బూర్వమే మనచే ననుష్ఠితము లయ్యె.

ఉ. అన్నలు దమ్ములంచు విన • యమ్ముల వావులు దిద్ది దిద్ది, పై
పన్నునఁ జూపి, యిచ్చకపు • మాటల తేటల నుబ్బఁ జేసి, భీ
మన్నను బాము ముద్దుకొను • నట్లును, గంగను దీర్థ యాత్రచేఁ
బున్నెము గూరఁ దోఁగునటు • పుచ్చుట సామముచేతనే కదా ? ౨౮

కం. ఓదనమున విషమిడమే ? యాదరమున గృహమునందు • నగ్నుల నిడమే?
కాదా యిది దానము విధి? భూదానమె కొఱతయింక • ముప్పదిమూరల్.[1]

ఇఁక భేదోపాయమే యవశిష్టము.

శకుని—దాని కుపాయము నేను జెప్పెదను. ఏవురకొక్క తెయే భార్య.

దుశ్శా—నిజమే కాని పాండవులఁ జూచి నారదుండు వచ్చి ద్రౌపది యొక్కొక్కరితోడ నొక్కొక్క సంవత్సర ముండునట్లును, నాకాలంబున వారు సహాసీనులై యుండఁ జూచినవా రొకసంవత్సరము తీర్థయాత్ర చేయవలయు ననియు, నియమపాశబద్ధులఁ జేసె నఁట.

శకుని—అట్లు చేయ కున్న ముళ్ళముని[1] ముల్లె యేమి మునిఁగెనో ?

దు—దుశ్శాసనా ! నీవు చెప్పినవార్త నేనును విన్నాఁడను. నారదుఁడు వారిని నియమపాశబద్ధులఁ జేసెను. కానీ వారిని యమపాశబద్ధులఁ జేయుదాఁక నాకు

1. శ్మశానమున. ద్వాపరయుగ పురుషులు దీర్ఘాంగులు కావున (2) ముళ్లముని-నారదుఁడు.

నిద్దు రెక్కడిది? ఈతకు మించినలోతు, బుద్ధికి మించినకార్యము,[1] గలదా? నారదుఁ డొకపథంబున మనకు మేలు చేసినవాఁడే.

కర్ణుఁడు—ఎట్లు?

దుర్యో—ఇప్పుడు వారిని వేఱుపఱుచుట సుకరము. ఈయదనున నాయత్నించు మఱి యొక ప్రయోజనము సాధించుట సుకరతరము.

కర్ణుఁడు—అది యేది?

దుర్యో—పాండవులకు ద్రుపదసాహాయ్యంబువలె నాకు యాదవసాహాయ్యంబులభింప నొకయుపమఁ బన్నితి. రామకృష్ణులచెలియలి సుభద్ర యనుకన్యను నేను వివాహమాడఁ గోరి బలరామునితో నుత్తరప్రత్యుత్తరములు జరపుచున్నవాఁడ. అతఁడును వల్లె యనినవాఁడు. స్నేహబలమునఁ గృష్ణపార్థులు వత్తిదీపంబులవలె నుంటఁ గృష్ణుండు సుభద్ర నర్జునున కీయ నభిప్రాయము గలవాఁ డయ్యు శ్రేష్ఠు బలరాము నతిక్రమింపఁ జాలకున్నాఁడు

కర్ణుఁడు—కృష్ణుఁడు బహుతంత్రజ్ఞుఁడు గదా? ఆయనమాటలకు లోనై తిక్కినవా రందఱు సుభద్ర నర్జునున కిచ్చెద ననిన?

దుర్యో—"నాకుత్తుక నుసు ఉండిన జరుగ నిత్తునా'[2]

కర్ణుఁడు—తాలాంకుని వాక్యములు విశ్వసనీయములా?

దుర్యో—సందేహ మేమి?

కర్ణ—"కన్యా వరయతే రూప" మని కలదు గదా? సుభద్ర నిన్ను వరించునో వరింపదో విచారించితివా?

దుర్యో—నన్ను వరింపదా నాభాగ్యమును వరింపదా? సౌందర్య మన నేమి? నేత్రానందదాయకమే. మోహమునకు గ్రంథోక్తి సౌందర్యమే ప్రధానకారణమేని లోకంబున వివాహితు లెంద ఱుందురు? అనంగుఁ డంధుఁడు సుమా? స్త్రీల వలపించునది చక్కఁదనము గాదు. ధనము.

కం. వరకులశీలములకు నురి, పరిమదమత్తేభమకరి ♦ బహుసుఖకరి యౌరా
సిరియును బ్రాయముఁ గలిగిన, పురుషునికనుసన్న రానిఁ పొలఁతుక యున్నే?

కర్ణుఁడు—నీకైనను సుభద్రయందు మోహము గలదా?

1. స్వబుద్ధిబలము జనబలము నమ్మినవాఁడు దుర్యోధనుఁడు. దైవబలము నమ్మినవారు పాండవులు. 2. ఇది యొకని విషయమున వృద్ధవటునివాక్కు.

దుర్యో—అదట్టులుండనీ. రాజనీతి మఱచితివా? ప్రభువులు బహుపత్నీకు లగుట వలపుచేతనా? కావున సుభద్ర నన్ను వలవకుండినను గార్య మేమో జరుగవలసినదే. నేను మానుదునా?

కర్ణుఁడు—మానకున్న బలవంతపుఁగవిత యగును.[1]

దుర్యో—కానిమ్ము. కర్ణా! నీకు దూరాలోచనము లేదు. యాదవులు మత్తులు. పశుపాలకులు. సింహాసనానర్హులు. క్షత్రియాధములు. నేనో విశుద్ధకులసంభూతుఁడ. ఉత్తమక్షత్రియుఁడ. నరపాలకుఁడ. రాజరాజను. సింహాసనార్హుఁడను. ఇట్టి నేను గోరిన వారా కన్యనీయ నిరాకరింతురు? సంతోషంబున నంగీకరింతురు గాక. ఇవి యన్నియు నాలోచించి కదా బలరాముఁ డీయ కొన్నవాఁడు. అయిన నిప్పు డొకటి. ఈవార్త పాండవు లెఱింగిన నచటికిఁ బయనింతురు. మనకుఁ గార్యము దుర్ఘటము. పాండవులలో నర్జునుఁడు మేరువుపూస. తక్కినవారు చిల్లరపూసలు. వేఱువడిన రెంకును గొఱగావు.

శకుని—మేలు దుర్యోధనా! మేలు. ఇం కొక్కటియుఁ జేయవచ్చును.

దు—చం. ఎఱుఁగుదు నీతలంపు, సరి • యొంటియు, లెస్సయు, దానిఁ దీర్పఁగా
మఱతునె? కైలఁబెట్టకుమ • వల్, వినఁ గోడకు వీను లుండు, నే
మఱఁ జలదాసిపుత్రుఁడు[2] సుమా మనలం గనిపెట్టి యుండి తా
ముఱిముఱి వారికిం దెలుపుఁ • బుట్టనిబిడ్డకుఁ బేర్లు పెట్టుచున్ ౨౭.

కన్న తల్లికైనఁ గనుమఱుఁగు మేలు. కావున మన మంతర్గృహమునకుఁ బోవుదము రండు.

(నిష్క్రమింతురు.)

---

## ప్రథమాంకము - చతుర్థరంగము.

(ఇంద్రప్రస్థము. అర్జునగృహము. అర్జునుఁ డొకపటము చేతఁ బట్టుకొని చూచుచు నిలిచి యుండును.)

అర్జునుఁడు—

సీ. ఈకళావతి మోము • నింపారఁగాంచినఁ, జంద్రునిఁ జూడ నే • జడుఁడు గోరు?
నీవిలాసినికనుల్ • భావించుధన్యుండు, తమ్మికై తా నేల • తమకపడెడు?

---

1 బలవంతపుఁగవిత=విరసమగానగునది. 2. దాసిపుత్రుఁడు - విదురుఁడు.

నీకపోలంబును ♦ నీక్షించుచతురుండు, ముకురంబునం దేల ♦ మోహ ముంచు ?
నీనవ్యబింబోష్ఠిఁ ♦ జేనూనుపుణ్యాత్ముఁ, డమృతంబునకు నేల ♦ యాసచేయు ?

తే. భువనమునఁ జూడఁ దగిన దీ ♦ పొలఁతి మోము
జగములను గోరఁ దగిన దీ ♦ సకియవలప
రమ్య యని చెప్పఁ దగిన దీ ♦ రమణి యొకతె
యౌర! సౌందర్యసీమ క ♦ న్యాలలామ.

ఈజగన్మోహిని కృష్ణసోదరి సుభద్ర యని విన్నప్పుడు నట్టింటి మహాలక్ష్మి యని, ముంగిటి పెన్నిధాన మని, కరతలామలక మని, భావించి యానందవార్ధి మునిఁగితి. ప్రాణులకు సంతోషంబులు చంచలాకాంతులు రూపమున దర్శనీయ యనిఁ సద్గుణవతి యని, ప్రథమదర్శనంబున గ్రహించితిఁ గాని,తక్కుదినంబులఁ దద్గుణసంపత్తి నారయ నారయ నహాహా ! ప్రస్తావవశంబున గదుఁడు చూపిన తజ్జన్మపత్రికచేఁ గులోద్ధారక పుత్రవతి, యగు ననియుఁ గంటి. ఇట్టిదాని గ్రహింప కున్నపురుషుజన్మ మేల ? బలరామాభిప్రాయంబు విన్నది మొదలు మనస్సు పరిపరివిధముల ప్రీలి పోవుచున్నది. అసులభ యనుతలంపునఁ బరిహాసమునకై గదుఁడు "నీ కిది పరమ గతి" యని దీని నిచ్చెను. ఎట్టులైన నతనివాక్యంబు సత్యత్వంబుఁ బొరయుఁ గాక. ద్వారవతికిఁ బోయివత్తునా ? అన్నగా రంగీకరింపరు. బలరాముఁడు కార్యసాఫల్యము గలుగ నిచ్చునా ?ప్రయత్నమే మానుకొందునా ? ఎట్లు మానుకొందును ? ఏమిచేయుదును ? (పటమును జూచి) మోహినీ ! నాచిత్తంబు భవదాయత్తం బైతత్తఱిల్లు చుండ నూరక చూచుచున్నదానవే? మార్గ దర్శినివి కారాదా ?నాపైఁ గటాక్షింప రాదా? కోమలీ! నీహృదయము మాత్ర మింతకఠినమా? ఒక్కపలు కైనఁ బలుక రాదా ? (అని ముద్దిడి) హా హతాశా చెడితివి కదా చిత్రకారునిచే! కింశుకసుమస్రష్టయుఁ జిత్రలేఖకుఁడు సములు. వ్యర్థవిద్య. కాదుకాదు.

చం. అవని విధాతృదత్త మగు ♦ నాయువుకంటెను దీర్ఘమైన యా
యువుఁ గలిగించుచున్, నిజహి ♦ తోత్కరరూపముఁ గానఁ జేయుచున్
సవరగ సౌఖ్యదుఃఖచయ ♦ సంస్మృతిఁ గూర్చుచు, దేశకాలసం
భవ మగుబాధ మాన్చుజన ♦ వర్ణితవిద్యయు వ్యర్థ మెట్లగున్? ౨౯

నిర్భాగ్యుఁడు సర్వథా భగ్నమనోరథుఁడే.

చం. మదనుఁడు దుర్నివారుఁ, డల◆మానినిరూపము వాగలీలమా
సుదతియు నస్వతంత్ర, చెలి◆చుట్టములెల్ల విచారహీనులుఁ
అనయులు శీతభానుమల◆యానిలులుఁ, మది నిగ్రహింప రా
దెది గతి? యేమి సేయుదు? నఁ◆కెట్లు సహింతు భజింతు సౌఖ్యముల్ ?
హా సుభద్రా సుభద్రా!

(తెరలో) దొంగలు దొంగలు.

సీ. కలుగరే తమరాజ్య ◆ గౌరవంబున నైన, నసదలు మొఱవెట్ట ◆ వినెడివారు ?
లేరే స్వధర్మాధి◆కారంబుఁ దలపోసి, యన్యాయవర్తుల ◆ నణఁచువారు?
రారే మదీయార్త ◆ రావంబుఁ గృపచేత, వినుచు నయ్యో పాప ◆ మనెడివారు?
కారే కృతాత్ములు ◆ చోరాపహృతములఁ, మాగోవుల మరల్చి ◆ మనుచువారు?
తే. రాజులార ! దివాకర ◆ తేజులార !
ధీరమతులార! ధర్మాధి◆కారులార !
లోకులార! దయార్త్రను◆శ్లోకులార !
మానుకొనరయ్య నన్నుఁ బు◆ణ్యాత్ములార ! (అనుధ్వని వినఁ బడును.)

అర్జు—ఏమీ ధర్మరాజురాజ్యమున నాగృహముసమీపమున దొంగలా.
ఔరా కాలమహిమ! పోయి విచారించెదఁ గాక.

(నిష్క్రమి)

---

ప్రథమాంకము - పంచమరంగము.

(ఇంద్రప్రస్థము. కుంతీ గృహము. కుంతియు ధర్మరాజు నాలోచించుచుందురు.)

కుంతి—తనయా! ఏల యింతదూరము యోజించెదవు? మొన్న యిచ్చటికి వచ్చి యుండిన సుభద్రను నీవు చూడలేదా? అది నీమనస్సునకు సరిపడ లేదా ?

ధర్మ—చూచితిని. నామనస్సునకును సమ్మతమే. కార్యసాధనోపాయము ?

కుం—ఇక్కడకు వచ్చినయాదవు లంద ఱీసంబంధము సర్వసమ్మత మనిరి కదా!

ధర్మ—రానివారు ?

కుంతి—రానివారిలోఁ గానివా రెవరు ? బలరామకృష్ణులే కదా రారైరి ? వారా మన బాంధవమునకుఁ బ్రతికూలించువారు?

ధర్మ—కృష్ణుఁడు ప్రతికూలింపఁడు.

కుంతి—బలరాముఁడో?

ధర్మ—అనుకూలింపఁడు.

కుంతి—ఏ మట్లు లనెదవు?

ధర్మ—నిన్నుఁ గినియింప నొల్లక నీకుఁ జెప్పరైరి కాఁబోలు? బలరామునకు దుర్యోధనుపై దృష్టియఁట.

కుంతి—దుర్యోధనుమీఁదనా?

ధర్మ—అవును.

కుంతి—(ఆలోచించి) నేను బోయి యడిగిన?

ధర్మ—అవమానమాత్రము ఫలము.

కుంతి—అర్జును నంపిన?

(అర్జునుఁడు తైర్థిక వేషములోఁ బ్రవేశించి)

అ—తల్లీ! సాష్టాంగనమస్కారములు. రాజేంద్రా! ప్రణామములు. (అని నమస్కరించును)

కుంతి—కుమారా! ఈ తైర్థిక వేషము నేల వేసితివి?

అ—జననీ! నిన్నరాత్రి నాయింటిపొరుగు బ్రాహ్మణుని గోవులఁ జోరులు తస్కరించుకొని పోవుచుండ నతఁడు మొఱ లిడెను. ఆధ్వని విని యాయుధశాల కరిగితి (ద్రౌపది ప్రవేశించి కుంతీదేవికి నమస్కరించును) అందు నేకాంతమున నున్న ద్రౌపదీయుధిష్ఠిరులఁ గంటి. నారదు నెదుటఁ జేసినప్రమాణముచొప్పున నొక సంవత్సరము తీర్థయాత్రఁ జేయనిశ్చయించితి మీయాజ్ఞనొంద నిట కరుదెంచితి.

ధర్మ—నీ వప్పుడు రాకుండిన?

అర్జు—గోవులు చోరాపహృతములై యుండును.

ధర్మ—అయిన నేమి?

అ—అపకీర్తి, ధర్మహాని, పాపము.

ధర్మ—ఎవరికి?

అ—నాకు, మీకు, వంశమున కంతయు.

ధర్మ—మన కెవ్వరికి నపకీర్తి, ధర్మహాని, పాపము కలుగకుండఁ జేసినపని ప్రాయశ్చిత్తమును బెట్టుకొనవలసినంత దుష్కార్యమా?

అ—అన్నా! అట్టు లనెద రేమి? మనసమయమును......

ధర్మ—నీవు వచ్చినది గోబ్రాహ్మణరక్షణార్థము కదా?

అ—గోబ్రాహ్మణనిమిత్తమైన దోషముగాదని ప్రమాణకాలమున నను కొంటిమా?

ధర్మ—అనుకొన కున్నను దోషము లేదు. "వారిజాక్షులందు వైవాహికములందుఁ బ్రాణ విత్త మాన భంగమందుఁ జకిత గోకులాగ్రజన్మరక్షణమందు బొంకవచ్చు" నని కలదు గదా?

అ—బొంకవచ్చునని యనుమతి కలదు గాని బొంకవలయు నని యాజ్ఞ లేదు గదా? ఆయాపద్ధర్మము దుర్బలులకు శరణము. శ్రీరామహరిశ్చంద్రు లాపత్కాలంబుల నెట్లు ప్రవర్తించిరి?

ధర్మ—"భూతహితంబుగాఁ బలుకుబొంకును సత్యఫలంబు నిచ్చు"నని యున్నది గదా?

అ—అదియు ననన్యగతికమార్గము. సత్యముఁ బలికి భూతహితంబుఁ జేయ శక్తియున్నచో బొంకవలయు నని విధియా?

కం. అవ్యాజంబుగ ధర్మము, సేవ్యం బని మున్ను మీరె ♦ చెప్పఁగ లేదే!
సవ్యాజంబుగ నిప్పుడు, భవ్యం బగునొక్క ధర్మ♦పథముఁ విడువన్.

ధర్మ—అర్జునా! నీవు శస్త్ర పాండిత్యమం దెంతెఘనుఁడవో శాస్త్రపాండిత్యమందంత సమర్థుఁడవు. ఐనను ధర్మనిర్ణయమం దుద్దేశము గదా ప్రధానము. నీవు కాముకుఁడ వై రాలేదు గదా? వచ్చిన తరువాతనైన నీమనసు వికలత నొందలేదుగదా?

అ—కాముకుఁడ నై రాను లేదు. నామనస్సు వికలత నొందను లేదు.

ధర్మ—ఇఁక నీకృత్యమునందుఁ బాపముఁ బొరయించునది యేది?

అ—ధర్మతనూజా!

కం. ధర్మంబుఁ జలుప నొండొక, ధర్మమునకు దాన హాని ♦ దార్కొను నేనిన్
ధర్మంబుగ నది తలఁపరు, ధర్మకళావిదులు ధర్మ♦తత్త్వజ్ఞవరా!

కావున నేను జేసినది యధర్మము కాదనుకొన్నను మనప్రమాణ ధర్మమునకు హానిఁ గలిగించును గావున నది ధర్మం బనరాదు.

ధర్మ—తమ్ముఁడా! కార్యాకార్యవివక్షయందు నంతఃకరణమే సత్ప్రవర్తనము గల వారికిఁ బ్రమాణము. లంకాపురి నగ్నస్త్రీలఁ జూచినయాంజనేయుఁడే మనకు గుఱి.

అ—అన్నా! మన యంతఃకరణశుద్ధి లోక మెఱుఁగునా? సత్యాసత్యవిమర్శనము మీఁదనా లోకప్రవాదము గలుగుట? లోకులు కాకు లనుసామెత వినమా?

చం. తెలియనివాఁడె రాఘవుఁడు దేవిమహామహిమం? బెఱింగియున్
గలికి నదేటికిం బనిచెఁ గానకుఁ? దండ్రిని సత్యభాషిఁ దాఁ
జలుపక యున్న నెవ్వఁ డొకొ చల్పు నటంచనుగాదె కానలో
నలజడి నొందె సత్యనియతాత్మకుఁడై? యది మీ రెఱుంగరే?

కావున లోకసంగ్రహార్థమేని నేను బోవుట యపేక్షణీయము. రాజులు ప్రజలకును, పెద్దలు పిన్నలకును, మార్గదర్శకులు గావున వారు హెచ్చరిక గలిగి ప్రవర్తింప వలయు. సూక్ష్మధర్మజ్ఞుఁడై శక్త్యతిశయంబున సమర్థుఁడు వెలికి కార్యంబుగఁ దోఁచుకార్యం బొనర్చెనేని యజ్ఞుండు కారణం బరయలేక విశ్వాసబుద్ధిఁ గార్యంబు మాత్రం బనుష్ఠించి శక్తిహీనుఁ డగుట భ్రష్టుఁ డగును. ఆపాపం బాసమర్థుఁడగు మార్గదర్శిఁ జెందును. శ్రీరాముఁడు సీతాదేవిని విడనాడక యుండినఁ బ్ర్యవనానం బెట్టులుండునో యోజింపుఁడు.

ధర్మ—తల్లీ! ఇఁక నేను జెప్పవలసిన దేమున్నది?

కుంతి—పుత్రకా! మాతృవాక్య మనుల్లంఘనీయము కదా?

అ—అమ్మా! కాదని యెవ రందురు? కేవల పుత్రవాత్సల్యంబునఁ గాక ధర్మైక దృష్టిఁ బ్రసిద్ధి వహించినకౌసల్యను, నియమపాలనంబునఁ గీర్తిఁ గన్న శ్రీరాముని స్మరింపుము.

కుంతి—యుధిష్ఠిరా! అర్జునుఁడు నన్ను మాటలచేతనే కట్టి వైచుచున్నాఁడు నే నేమి చెప్పుదును?

భద్రా—సుందరా!

అ—దేవీ! మావంశమునకు మూలపురుషు లైన పురూరవశ్చంద్రులకంటెను గులాభరణం బగు నలచక్రవర్తికంటెను సుందరుఁడనా? సుకుమారుఁడనా?

ద్రౌ—పురూరవశ్చంద్రులకంటె నుత్తముఁడవు. నలచక్రవర్తికంటె హీనుఁడవుకావు.
అర్జు—అంతటివాఁడు ప్రారబ్ధమును దప్పించుకొనఁగలిగెనా ?
ద్రౌపది—మీా రేవురు నాకుఁ బంచప్రాణంబులు. ధనంజయా ! ఈ దేహంబు నిర్జీవం బైనను నీవు మాత్రము దీనియం దభిమానంబు వదల వని నమ్మి యుంటి.†
అర్జు—దేహులకు సంశ్లేష విశ్లేషంబులు ప్రవాహగతకాష్ఠంబులు. బుద్ధిమంతు లవి గణింతురా ?
ద్రౌపది—పతులకు సమయోచితసౌఖ్యంబుఁ గూర్చుపత్నులు లోకంబునఁ గలరు గావి నావలెఁ బతిప్రవాసంబునకుఁ గారణభూతి యగునిల్లాలును గలదా ? దానిఁ దలఁచు కొలఁది దుఃఖ మాఁపరాక యున్నది.
అర్జు—కారణము దైవము.
ద్రౌపది—అయ్యో పాపి నైనమా !
అర్జు—ప్రాణి స్వకర్మబద్ధము దైవమును దూఱకుము.
ధర్మ—అర్జునా ! నీవంతిదృఢ చిత్తుండ వైన నే నేమిచేయవచ్చును ? పోయిరమ్ము. కల్యాణమస్తు.
అర్జు—తల్లీ ! యనుజ్ఞ నిమ్ము.
కుంతి—పుత్రా! నీమన స్సింతకఠినంబుఁ జేసినవిధాత ననవలయుఁ గాక నిన్న ననేల ? ఇంతవఱ కెన్ని యిడుమలు వచ్చినను మన మెల్ల నొక్కటిగ నుంట నాకేదియు దుఃఖంబుగఁ దోఁపదయ్యె ఇప్పుడు దీర్ఘకాలం బొంటిగ నీవు సన్యాసివలెఁ జరించెద వన నామన స్సెట్లు లోర్చియుండు? నేనెట్లు స్వస్థతఁ గాంతు ? మరల నినుఁ జూచుదాఁక నిన్నే కలవరించుచుండుఁ గాదె? నాకిట్టికష్ట మొసంగుట న్యాయ్యమా?
అ—అమ్మా ! నిబ్బరించుకొనుము. నీ కిట్టిపరితాప మర్హమా ? స్వకులశీలధర్మంబుల రక్షించుట స్త్రీలకు నర్హమేకదా? ఆమె కొడుకు సత్యవాదియని, యామె పెనిమిటి నియమహీనుఁడని, లోకం బాడిన నాయపకీర్తి స్త్రీలను బాపించుఁగాదె? కావునఁ బురుషులు దుర్మార్గవర్తు లయినను వారిని జక్కదిద్దుట వారిమేలుఁ దమకీర్తిఁ గోరు స్త్రీలకు సముచితంబు. మీా రిట్లు విచారపడరాదు.
కుం—నాయనా! పుత్రవాత్సల్యము చెడ్డది సుమా. అయినఁ బోయి నేను జీవించి యుండగనే రమ్ము. శత్రువులవలన నేమఱెదవు సుమా.
అ—తల్లీ ! భీతిల్లవలదు. సర్వమునకు వాసుదేవుఁడే కలఁడు. మనయత్న మేమున్నది?
కుంతి—పుత్రా ! విజయోస్తు. పోయిరమ్ము.

---

† ధనంజయు వాయువు ప్రాణము పోయిన తరువాతఁ గొన్ని గడియల వఱకు దేహము విడిచి పోకుండును.

ద్రౌపది—భద్రావాప్తి రస్తు [1] (తెరలో - తథాస్తు)

ధర్మ—ఉపశ్రుతి బాగున్నది. వాకిటఁ దథాస్తనుచున్నవా రెవరు? ద్వారపాలా! వారిని లోపల రమ్మనుము.

లంబోదర సిద్ధాంతి, జటాధర శాస్త్రి—శంభూశంకర గౌరీశా (బ్రాహ్మణులు కావడులతోఁ బ్రవేశింతురు.)

కమలనాభాచార్యులు—శ్రీకీమాధవలక్ష్మీశా (అని యెదిటివైపునుండి ప్రవేశించును.)

లంబో, జటా—పార్వతీరమణా పరమేశా.

కమల—భక్తావన హరి జగదీశా.

లంబో, జటా—పురహర మృగకర కరిశిక్షా.

కమల—మురహర దరకర కరిరక్షా.

లంబో, జటా—రాజేంద్రా! మీ సోదరుని కారణంబున [2] మేము కృతకృత్యులము గా నెంచితిమి. మాకును దీర్థయాత్రకు సెలవీయ వలయు.

ధర్మ—ధరాసురులారా! మీకు సుకృతవర్ధన మగుఁగాక. [3]

1-వ బ్రా—(అపవారితముగ రెండవబ్రాహ్మణునితో) ఈమన యమోఘవాక్య బలంబున జయంబు నొందఁ గోరి వచ్చితిమే ఇట్లనియె నేమి?

2-వ బ్రా—(అపవారితముగ) దాని కేమిలే?

కమల—రాజేంద్రా! నాకును సెలవా?

ధర్మ—బాలకా! హెచ్చరిక సుమా. మనతోడి మనుష్యుని విడనాడకుము పోయి రమ్ము. (అర్జునుఁడు బ్రాహ్మణులతోడ నిష్క్రమించును.)

కుంతి—యుధిష్ఠిరా! తా నొకటి దలఁచిన దైవ మొకటి తలఁచును.

ధర్మ—సత్యము.

కం. సుఖప్రద మగు నని మదియ్యది, తలఁతుమొ యది వేగ మిగుల దవ్వుదవ్వగుచున్
గలలోనే నెది యగు నని, తలఁపమొ యది యప్పు డగును దైవవశమునన్.

నేను గొలువుకూటంబున కేగవలయు. అనుజ్ఞాతుఁడనా?

కుంతి—అవశ్యము. (ధర్మరాజు నిష్క్రమించును)

ద్రౌపది—నేను బనివిందునా?

కుంతి—పోయిరమ్మా. నామనస్సు వ్యాకులత వహించి యున్నది. అంతర్గృహంబునకుఁ బోయెద. (కుంతి ద్రౌపదులు నిష్క్రమింతురు.)

---

1 సుభద్రకు భద్రయనియుఁ బేరుగలదు. 2 సోదరుని + కారణంబున. సోదరు + నికారణంబునః; నికారణము వృతి. 3 ధరా † అసురులారా. వర్ధనము = ఛేదనము.

# సుభద్రా విజయము.

---

### ద్వితీయాంకము – ప్రథమరంగము.

[భోగవతీపురము. ఉలూపి శయనగృహము. అర్జునుండు పాన్పుపై నిద్రించుచుండ నులూపి ప్రక్క నిలిచి యుండును.]

ఉలూపి—

సీ. ఏనోము ఫలమొ యీ మానినీమన్మథుఁ, గన్నులారఁగఁ గాంచఁగలిగె నేఁడు
ఏజపఫలమొ యీ హృదీశునకర్పించుకొ, ముదిఁ బారణము సేయ నొదవె నేఁడు
ఏవ్రతఫలమొ యీ సువ్రతునవసుధా, క్రమభాషల వినఁ గలిగె నేఁడు
ఏతపఃఫలమొ చిత్తేశ్వరు బిగినింపుఁ, గౌఁగిటఁ గులుకంగఁ గలిగె నేఁడు
తే. ఇపుడు గద నాదుకోర్కెలు దీర్చెఁ బ్రహ్మ, యిపుడు గద నాదు పుట్టువు సహీనతఁ గనె
నిప్పుడానందరసవార్ధి నీఁదఁగంటిఁ, బ్రాణముల కిప్డు దేహాభిమాన మెసఁగె.

మనస్సా! నీకన్న వంచకంబు లోకంబున లేదు. ఎన్నెన్ని లోకములయందో సంచరించి యెట్టెట్టిరూపములో కనఁబడిచితివి గాని యిట్టిరూపముఁ జూపఁ జాలవైతివి. కావునఁ గదా మనఃకల్పితములు కేవలభ్రాంతిమూలకము లసత్యము లని కొందఱందురు. నీయందు భావనశక్తి దక్కఁ బావన మైనభావన శక్తిగానరాదు. నేత్రములారా! మీరు ప్రధానేంద్రియము లగుట నేఁడు నిజ మయ్యె. మనోహర దర్శనలాభంబున నానందమును దోలుదోల్త మీరకదా యనుభవించు చున్నవారు. మీయాశ నంతయు నిప్పుడు తీర్చికొనుఁడు. దేహమా! యేల నీవును జెమట నెపంబునఁ గరఁగెదవు. చంద్రకాంత మచేతనం బయ్యుఁ జంద్రదర్శనంబున ద్రవించుఁగదా? ప్రియుని నిక్కినిక్కి చూచుటకా పులకములారా యెగయుచున్నారు? హస్తములారా! సన్నిధానంబు సన్నిధానం బయ్యె. గ్రహింపుఁడు. కౌఁగిలింతల మీబిగి నేఁడు చూచెద. మోము మోమునఁ జేర్చి యొకముద్దైనఁ బెట్టుదునా? నానాథునకు నిద్రాభంగమగు నేమో. నిద్రాదేవీ! నీవు నా కెక్కడి సవతివి దాపరించితివే? నాప్రియుని నీవశునిఁగఁ జేసికొని నన్నుఁ గన్నులనైనఁ జూడనీయవే? (అని ప్రక్కఁ గూర్చుండి యతని

పాణితలంబునఁ దనవక్షంబున నొత్తుకొని) హా స్తవమా! నా కభయదాతవు గమ్ము.
(అని యఱచేత ముద్దు పెట్టును.)

(అర్జునుఁడు నిద్రలేచుట నభినయించును. ఉలూపి మఱుఁగును.)

అర్జు—(నలుప్రక్కలఁజూచి యాశ్చర్యము నటించుచు) ఏమిది యాశ్చర్యము!
నేను బరుండిన దెక్కడ? నేనుండు న దెక్కడ?

సీ. గంగా తరంగిణీ♦కలితకూలం బేడ, నీదుకూలం బేడ ♦ నింతలోన!
సమలరాకాచంద్రి♦కాభోగతల మేడ, నీభోగతల మేడ ♦ నింతలోనఁ!
పావనమృదు సిక♦తావితానం బేడ, నీవితానం బేడ ♦ నింతలోన।
భవ్యకృష్ణాజినో♦పరిశయనం బేడ, నీశయనం బేడ ♦ నింతలోన!
తే. నరుఁడ నేను గానో? మా♦యావిధంబొ?
స్వప్నమో? కాక మిగుల నా♦శ్చర్య మయ్యె
నేమిలోకంబొ? యియ్యది ♦ యెవరిగృహము?
యెట్లు వచ్చితినో యిప్పు ♦ డిందుఁ జేర? ౩౭

నే నర్జునుఁడనే కదా? అర్జునుఁడఁ గాకున్న నర్జునుఁడఁ గదా యని యెట్లు స్ఫురించు? నే నేమి కవినా? నటుఁడనా? వారు గదా తమయం దన్యత్వ మారోపించుకొని తమ్ముఁ దాము మఱచి తన్మయత్వమున వర్తింతురు. ఇన నిది కల కాఁబోలు మన స్సెఱుఁ గనికలయా! హృదయవైకల్యమా? అంతఃకరణము శుద్ధముగా నున్నదే. చేతియందిది యేమి తాంబూలపుఁగట్ట! నాతోడివా రేరి? నావా రొక్కరు నిందు లేరుగా? ఉలూపి—(ప్రవేశించి) నే నున్నదానను.

అ—(ఆశ్చర్యమున నులూపి నెగాదిగ సందేహదృష్టులఁజూచి పాన్పుడిగి) నీ వెవ్వతెవు?
ఉలూపి—నేను నాగకన్యకను. ఉలూపి యనుపేరు గలదానను.
అర్జు—ఇది యేలోకము? ఏపురము?
ఉలూపి—నాగలోకము. భోగవతీపురము.
అర్జు—ఈ గృహ మెవరిది?
ఉలూపి—నాయది.
అర్జు—అయినచో నే నిట కెట్లు వచ్చితినో చెప్పఁగలవా?
ఉలూపి—నేన తెచ్చితి.
అర్జు—ఏల?

ఉలూపి—భూతదయచే.

అర్జు—అర్థము గూఢము.

ఉలూపి—నీప్రాణము రక్షించుకొనుటకు.

అర్జు—(స్వగతము) నాప్రాణము రక్షించుకొనుటకా? (చిఱునవ్వున) (ప్ర.) నాప్రాణమున కపాయమా? అబలా! నీవా రక్షించితివి? నీమాయమాటలు చాలును.

కం॥ నరులన్ దుర్దమనిర్జర, నరులన్ గెలువంగఁ జాలు పటుశౌర్యధనున్
హరిణాక్షి! నీవు కాచితె? హరినిన్ మృగకన్య కాచెనా? నిజ మనుమా.

ఉ—కౌంతేయా? నీ మనోగతం బెఱింగితి. నన్ను సంశయదృష్టులఁ జూడవలదు. నావి మాయమాటలు గావు. త్రికరణశుద్ధి నమ్ముము. నేను నీహితకారిణిని. గతంబు నీ వెఱుంగవు. నీ కపకార మొనర్చుదాననేని నీవు మేల్కాంచుదాఁక నేల వేచియుందు? ఈ పత్రికఁ జూడుము. సర్వము వేద్యం బగు. (అని రవికలో నుండి పత్రికఁ దీసి యిచ్చును.)

అర్జు—(తనలోఁ జదువుకొని యాలోచించి) (స్వ) అక్షరములు చేవ్రాలు వానివే. సర్వము కరతలామలక మయ్యె. ఎంతద్రోహము! అచటి మాయన్నదమ్ముల గతి యేమో. ఇది యథార్థవాదినిగా నుండునా? ఈవిషధరయోష విషచిత్తగా నుండదు గదా? అవిశ్వాసంబున విషము బెట్టునో? అయినను నామె రూపములఁబట్టి మనస్సు విధం బూహింపరాదు ఇది యా దుష్టునకు వశురాలేని యిది చెప్పినట్టు లిప్పుడే నన్ను హింసించి యుండును. ఇది స్త్రీగదా? తరిచెదఁగాక. (ప్ర) నాగకన్యకా? యీ పత్రిక నీమాయా కల్పితము గాదు గదా?

ఉ—నరేంద్రనందనా?[1] మేలు మేలు! ఉపకృతి నికృతి నారోపించితివి. [§]మాయాపత్రిక సృజించిన నాకు రాఁగలలాభ మేమి? నే నొకకార్యంబుపొంటె గంగాతీరంబున విహరించుచు స్త్రీస్వభావకారుణ్యంబునను, మీయన్నను రక్షించినమాయార్యకు దౌహిత్రుని దౌహిత్రుండ వగుట ననురాగంబునను, నాపదయందు మునింగిన నిన్ను దరిఁ జేర్చితి. నాయపరాధమును సైఁపుము నీవు పినుఁడ వౌదువుగాక. నిద్రించుసింహమును నక్కయుఁ బరిభవించు ననుట మఱవకుము.

అర్జు—కల్యాణీ! కోపింపకుము నన్ను గంగాస్నాన మాడించిన వారేమైరి?

ఉ—వారిని బట్టితేర సేవకుల నంపితిఁగాని తప్పించుకొని పోయిరి. కలహమున నీ పత్రము మాత్రము చిక్కెను.

---

1 నరేంద్రశబ్దము పాముల పట్టు విషవైద్యునికిని నన్వయించును.

§ Subhadra.

అర్జు—ప్రాణదాత్రీ!
ఉలూపి—(స్వ) అయ్యో! ప్రాణేశ్వరీ యనఁడుగా?
అర్జునుఁడు—

కం. ఉపకృతిఁ జేసినవానికి, నుపకారముఁ జేయఁ దలఁచుచుండుట తా నా
యుపకారి యాపదం గన, నెపుడున్ ధ్యానించుచుంటయే కద చెలువా?

కావునఁ గృతజ్ఞతాబుద్ధి నిన్ను స్మరించుచుండెద. నీకు శుభం బగుఁ గాత. నామిత్రులు నన్ను వెదకు చుందురు. నన్ను వారిం గలుపుము.

ఉలూపి—నిన్ను వారిం[1] గలుప నీవార లున్నవారు. కృతజ్ఞుఁడా! ఈ యనాథ ప్రాణా పాయదశ నుండనిచోఁ గదా నీవాపదఁ గోరుట? నా కెక్కడి శుభము? (నిరుత్సాహంబు నటించుచు) ఊఁ పోయినమ్మ. దైవమే శరణము.

అర్జు—(స్వ) ప్రయోజనము నుద్దేశింపక మందుఁడును బ్రవర్తింపఁడు. ప్రత్యుపకారార్థినియై యిది నా కీయుపకృతి నొనర్చెఁ గాఁబోలు. ప్రత్యుపకృతిఁ జేయుదుఁ గాక. ఎవరితోడ నైన సమరంబున కీయఁగొల్పు నేమో, నిరాయుధుఁడనే. కాని చూతము. (ప్ర) దయావతీ! నీకుఁ బ్రాణాపాయమా? నీచే జితుఁడను నీ కభయ మిచ్చితిని. నిన్ను రక్షించెద. నీవృత్తాంతముఁ జెప్పుము

ఉలూపి—(స్వ) నాచే జితుఁడవా? మదనునిచే జితుఁడ వైనఁ గదా ధన్యను?(ప్ర) ప్రయాణపుఁదొందరయం దున్నవాఁడ వేమి చేయుదువులే?

అర్జు—అట్లుకాదు. అవశ్యము నీకార్య మొనర్చి వెళ్లెదను.

ఉ—ఏల నన్నుఁ బట్టుపఱిచెదవు? చెప్పినపిమ్మటఁ జేతులు వెల్లకిల వేయుటకా?

అర్జునుఁడు—తలోదరీ! ఏమట్టు లనెదవు?

ఉ. ఘోరమహాపదన్ మునిఁగి కుందెడివారలఁ జూచి యార్యుఁడౌ
పూరుషుఁ డెవ్వఁ డొక్క మదిఁ బూనఁడు వారలకుం దు మాన్పఁగా?
హారిశరీర! నీ వబల వయ్యును గాచితి నాదుప్రాణమున్
నీకుఁడ నయ్యు నీవతనుభీతిని[2] గుందఁగఁ గావ కుందునే? ४०

ఉపకారికాని వానికిని నుపకారముఁ జేయ విధియై యుండఁ బూర్వోపకారుల నుపేక్షింతునా? ప్రత్యుపకారబుద్ధి లేవరించెడిని. పెక్కుమాట లేల?

కం. విడిచెద బంధుల నేనియు, విడిచెదఁ బ్రాణముల నేని విడిచెద సిరులన్
విడువను సత్యవ్రతమును, బడఁతీ! సత్యంబుమీఁద బాస యొనర్తున్

1 వారిం=నీళ్లు. 2 అతనుభీతి=(I)అధికభయము(II)మన్మథునివలని భయము.

నీ తాప మార్చెదఁ జెప్పుము.

ఉలూ—సూక్ష్మధర్మజ్ఞుఁడా! వారిజాక్షులందుఁ బొంకవచ్చు నను విశేషధర్మము నీకు మీ యన్నగారే యుపదేశించిరి గదా?

అ—(స్వ) అది దీనికెట్లు తెలిసె? విద్యాబలముచేఁ గాఁబోలు. (ప్ర) వ్యాజం బిడి సత్యహాని ఘటింతు ననియా నీయాశయము? నెప మిడి బాస దప్పువాఁడు గాఁడర్జునుఁడు.

ఉ—నీ వంతటిసత్యసంధుఁడవేని చేతిలోఁ జేయి వైచి బాసచేయుము. విశ్వసించెద. చేయనివానికిఁ జెప్పియవమానపడ నొల్ల. అవమానమునకన్న మరణమే మేలు. (అని చేయి సాఁచును)

అర్జు—(చేతిలోఁ జేయివైవఁబోయి వెనుదీసి)

కం. పరధనకాంక్షాహీనుఁడఁ, బరభామానఁ జూడ నేక ♦ పత్నీకుండన్
దరుణీరత్నమ వగునీ, కర మంటుట నాకుఁ దగని ♦ కార్యము ముగ్ధా?

మఱి యేబాసనైనఁ జేసెదను

ఉ—నే నెంతముగ్ధ నైనను రాజులచిత్తవృత్తు లెఱుఁగని మూఢనా? ఈ వేషములు నాకుఁ దెలియవా? నీ వేకదారవ్రతుఁడవా? ద్రౌపది నీ కేమి కావలయును? సుభద్రకుఁగా నేమని కలవరించుచుంటివి? ఆమాటలు నా కేలకాని, నీనియమముఁ దెలియక నీటమునింగిన నన్ను నాకన్యాశీలహానికి నోర్చితిఁ? నీవ్రతమునకు భంగంబుఁ గలిగించితి. క్షమింపుము. సత్యవ్రతహాని లేకుండఁ బోయిరమ్ము. ఈవ్యర్థజీవినికిఁ బగతునిచే మానప్రాణహానులు గూరిన లోకమునకు వెలితియా?

అర్జు—లతాంగీ! యింత యేల? రమ్ము చేచాఁపుము.

ఉలూపి—ఈ సారి కింకే నేదైన నుపాయమున్న వెదకుము. నన్నేల యిత్తఱిఁ బరిహాస భాజనంబుఁ జేసెదవు? ఏల నీ కంతయెల్లిక నైతి?

అర్జు—కలికీ! కినియకుము. తప్పక ప్రమాణ మొనర్చెద. చేయి చాఁపుము (ఉలూపి చేయి సాఁచును.) నీభయముఁ బాపెద. నిన్నేఁచు వాఁ డెవఁడు? (అనుచు నర్జునుఁడు చేతిలోఁ జేయి వైచును.)

ఉలూపి—(అర్జును చేతిని గట్టిగ బట్టుకొని) ప్రాణ నాథా! న న్నేఁచువాఁడు విరహిజన భీకరుఁడు—కుసుమశరుఁడు.

చం. మన మిఁక నిల్ప నోపఁ జూమి ♦ మానవతీసుమచాప! నీకునై
ఘనతర మోహతాపమున ♦ గాసిలి స్రుక్కుచు నున్నదాన, నా

యనుపమపుణ్యపాకమున నయ్యెఁ గరగ్రహణోత్సవంబు, నా
వనజశరార్తిఁ బాపి దయఁ బాలనసేయుము ప్రాణనాయకా! ౪౩

మనఃప్రభవుండు పురోహితుండుగ, మదనానలంబు సాక్షిగ, నాపాణి గ్రహించితివి. ఇఁక నీదాన నైతి. నన్నేలుము.

అర్జు—(నిశ్చేష్టుఁడై యుండి కొంతవడికి) (స్వ) ఓరా! కామినీత్వము. (ప్ర) మత్తకామినీమణీ! యెంత సాహసకార్య మీవు ఘటించితే?

ఉలూపి—ఏమి యియ్యది సాహసం బని యింద్రనందన! యెంచెదే?

అర్జు—భామినీ! నరలోకవాసినిఁ బట్టి తేరఁగఁ జెల్లునే?

ఉలూ—శ్యామలాంగక! యెన్నినాళ్లని సైఁచి యుందును జెప్పుమా? ౪౪.

ప్రాణేశ్వరా! ద్రౌపదీస్వయంవరంబున నిన్నుఁ జూచి వచ్చినమానాగకన్యలు నిన్ను వర్ణింప విన్నది యాదిగాఁ దాపంబున నాపడుపాటునకు మదనుఁడే సాక్షి.

ఉ. కాలము వేచివేచి, తమిఁగాఁకలపేఁకల సైఁచిసైఁచి, బా
ష్పాళులఁ గార్చికార్చి, కుసుమాస్త్రునికోఁతల కోర్చియోర్చి, కా
లాలయు మేగుప్రాణముల నాశబలంబున నిల్పఁ జాలు టీ
వే లవ మెంచి చూడు మది యెంతటిసాహసమో నృపాత్మజా! ౪౫

ఇంత యేల? ఒంటరిపాటునఁ జిక్కిన మద్దీర్ఘతపఃఫలంబవగు నీపైఁ బడి ముద్దైనఁ బెట్టని ఱాతిగుండెదాన నఁట. ఏకార్యముఁ జేయఁజాల?

అర్జు—నావృత్తాంతము నీకుఁ దెలియదు కాఁబోలు

సీ. తీర్థసేవాసక్తిఁ దిరుగు నాబోఁటిసు, వ్రతి యేడ? రతి యేడ? రాజవదన!
జలపారణను మేను నిలుపు క్షేత్రోపవ, సతి యేడ సతి యేడ? సారసాక్షి!
వరనియమస్థితిఁ ఫలమూలనిచయభు, గ్స్మరుఁ డేడ స్మరుఁ డేడ? జలజగంధి!
శ్రోత్రియస్థితి నగ్నిహోత్రముల్ సలుపువా, మరు లేడ మరు లేడ? మంద
యాన!

తే. పరసతీసోదరుండనై పరఁగు కేడఁ? గంజలోచన! భోగినీగమన మేడ?
నెంతకును మేషులుంఠితస్వాంతవైన, స్తోకమైనను వలదె వివేక మతివ?

ఉ—నీ తెఱంగు నేనెఱుంగనిదానఁ గాను. ద్రౌపదీవిషయంబున మీచేసిన సమయం బాదిగ సకలం బెఱుంగుదు.

అర్జు—ఎఱిఁగి యెఱిఁగి నన్నేల తెచ్చితివి!

ఉ——కం. నూనాస్త్రీఁడు దుర్వారుఁడు, మానఁడు పగఁ జెందుచుండు ♦ మలయానిలుఁడో
పూనఁడు దయ నేటు సేయుదుఁ? బ్రాణంబులు దీపమన్న ♦ పలుకులు వినవే?

అర్జు——లోకంబున నిట్టివక్రప్రచారలు ప్రతీపదర్శినులు నుందురా?

ఉ. నీదు మహావిమోహ మది ♦ నీకబరీనిబరీసతం గానెన్
నీదనవార్యకామ మది ♦ నీకుచయుగ్మమునుబ్బుఁ గైకొనెన్
నీదుమనంబు చంచలత ♦ నీనయనంబులకీవి దెల్పెడున్
నీదువివేకహీనతను ♦ నీతనుమధ్యమె చాటెడుం జెలీ! ౪౮

ఉలూపి——రసికజనాగ్రేసరా!

తే. విరసు లగువారి సంస్తుతి ♦ విధము కంటె, సరసులగువారి రోషభా ♦ షణము మేలు
ఖరవిరావపుసంగీతరా ♦ గంబుకంటె, మధురవాణీవిలాపక్ర ♦ మంబు మేలు. ౪౯

మత్తకోకిల. చిన్నదానను, నీకునై మరు ♦ చిక్కులం బడి స్రుక్కితిన్
జెన్నుగట్టితి నిన్నినాళ్లుగ ♦ జవ్వనంబు మనోహరా!
కన్నెఁగాని మగంబునుగాను ని ♦ గాంచి పుంవయు మన్ననన్
జన్నవన్నెలవెన్నెలం దమి ♦ చిన్నెల న్నను నేలుమీ. ౫౦

అ——సీ. పరభామినీసమా ♦ దరుఁడ నందు నెజెంగి, పట్టుపటిచెద వేల ♦ బాలనన్నుఁ?
ఉలూపి——బరిణయమే లేదు ♦ పరసతి నెట్లైతిఁ? గన్యక నేను సౌ ♦ జన్యధన్య!
అ——ఉరగాంగనవు నీవు ♦ నరజాతిజుఁడ నేను, న్యాయ్యమా ననుఁ గోర ♦ నంబుజాక్షి?
ఉ——రామచంద్రకుమార ♦ రత్నంబు కుశరాజు, మాకు ముద్వాలిని దాఁ ♦ జేకొనండె?
అ——తైర్థిక వేషంబు ♦ దాల్చిన నన్ జూచి, మరు లెట్లు లొదవెనే ♦ మగువ నీకు?
ఉ——మబ్బుమాటున నున్న ♦ మాత్రెఁ జందురుఁ జూచి, వికసింపదే కల్వ ♦ వినుతరూప!

తే. ఏల యిటు ప్రౌఢ్వు వుచ్చెద ♦ వింద్రతనయ! జాలిమాలి నెపంబుల ♦ సదయచరిత!
తాళఁజాలను మరులింకఁ ♦ దధ్యమింత, కౌఁగిలింపుము ననుఁ బట్టి ♦ కరుణఁబుట్టి.

అ——సుందరీ! విధివిధానంబునఁ జేయఁబూనిన నాకు బ్రహ్మచర్యం బను ష్ఠేయంబు గదా? నాహితకారిణి వంటివి. నావ్రతహానికిఁ గారణభూతురాల వగుట ధర్మజ్ఞవు ధర్మచారిణివగు నీకు ధర్మమా? కావున నావ్రతాంతము దనుక నైన సైరింపుము. పదపడి నీయభీష్టంబుఁ దీర్చెద.

ఉ—కం. వనితలసంగతిమానుట, చను నొక్కవిధంబుబ్రహ్మ♦చర్యం బగుచుఁ
దనసతితో ఋతువేళలఁ, జనవున మెలఁగుటయు బ్రహ్మ♦చర్యంబ సుమీ.

ఇది నాకు ఋతువేళఁగాన నన్ను నీవు భార్యగ గ్రహించిన నీకు వ్రతహాని లేదు.

కం. ఋతుమతి యగుతనసతి దను, రతికిం బ్రార్థింపఁగాఁ ది♦రస్కృతి సేయన్
బతి పొందవు భ్రూణహత్యా,మితదుష్కృత మనఁగ వినవె ♦ మేధావివరా।

నీ వ్రతహాని నగుపాపంబు నే నోర్చెదఁ గాక. భ్రూణహత్యామహాపాతకంబు నీ వెట్టు లోర్వఁగలవు ? నీకు నే నేమిధర్మం బుపదేశింపఁ గలఁ గాని యొక్కటి యాలోచింపుము.

ఉ. నాయక ! నీనిమిత్తమయి ♦ నాదుశరీరమునందుఁ బ్రాణముల్
పాయక యుండ నెట్లొ బిగఁ♦బట్టితి నాసల నూఁతఁడించియే.
యీయెడ నీవు వల్దనిన ♦ నింక మఱేగతిఁ బోవ నేర్తు ? నీ
కాయములోడ నేమిపని ♦ కాంతుఁడ ! నీవ యెఱుంగఁ జెప్పుమీ? ౫౪

వ్రతాంతంబుననాయభీష్టంబుఁ దీర్ప బాస చేసినాప్రాణభర్త విప్పుడ వైతివి.

అ—(స్వ)అయ్యోనా వ్రతంబుసవ్యాజం బయ్యెడిఁ గదా? (ఆలోచించుచు నిలుచును )

ఉ—కం. స్మరశరతాడిత నగుటను, మరణ భయంబునను నీదు♦ మఱుఁగుం గనితిన్
శరణాగతరక్షణ మను,బిరుదము నీయందు లేదె ♦యీగుఁడ చెపుమా? ౫౫

(అర్జునుఁడు చలింపక నిలుచును.)

ఉలూపి—అవ్యాజంబుగ ధర్మము సేవ్యంబని చెప్పిన నీవే నాయతనుభీతిఁబాపెదనని ప్రాణంబులకంటె మిన్నయగుసత్యంబుపై బ్రమాణంబుఁ జేసియు, సత్యహాని కోర్చుచున్నవాఁడవు.ఇఁక నాకుఁ బ్రాణ మననెంత ? నీపరోక్షంబున మరణించుటకన్న నీదు చరణంబులం బడి యిప్పుడ మరణించెద (అని మోఁకరించి కూర్చుండి జడతో నురి పోసికొన యత్నించును.)

అర్జు—(స్వ)

కం. కన్నియయఁట నాకై తా, జన్నియ గట్టెనఁట దనదు♦జవ్వనమును నా
పన్ను ననుఁగాచెనఁట నే,నిన్నలఁత నుపేక్ష సేయ♦మృతిఁ గూర్చుఁ గదా.౫౬

అది యటుండ నెంతమోహము లేనిదే నన్యాసక్తుఁడ నని యెఱిఁగి యెఱిఁగి నన్నుఁ గామింప యత్నించునా !నాపై మోహంబునఁ గాకున్న నిన్నిపాటు లేల పడును (ఉలూపిని సమీపించి,జడ నూడఁదీసి) (ప్ర) మనోహారిణీ! ఎంతవేగిరకత్తైవే!

ఉ—ప్రాణేశా! విడువుము. విడువుము. అన్యకాంతాసక్తు వలచుటే యంగనకు మానహాని హేతువు. అనురాగబలంబున నవమానభయం బుజ్జగించి, తగిన ప్రతిఫలం బందితి. ఇఁక నన్ను నిర్బంధింపకుము విడుము. ప్రత్యక్షంబునఁ గాకున్నఁ బరోక్షంబున నైన................ (నిష్క్రి)

అర్జు—మానినీ! నిలుము, నిలుము. నాయాన సుమీ (అని దాసికొంగుఁ బట్టుకొని నిష్క్రమించును.)

---

## ద్వితీయాంకము - ద్వితీయరంగము.

(సౌభద్రతీర్థ సమీపదేశము. అర్జునుఁడు బ్రాహ్మణగోష్ఠిలో నుండును.)

అ—బ్రాహ్మణులారా! ఏల న న్నీపంచతీర్థము నాడ వల దను చున్నారు?

(ఇద్దఱు బ్రాహ్మణులు ప్రవేశింతురు.)

బ్రాహ్మణులు—పాండునందనా! విజయోస్తు.

అర్జు—ఉర్వీదేవతాశీర్వచనముఁ బరిగ్రహించితి.

బ్రాహ్మ—నీవు వీరుఁడ వని, యుదారచిత్తుఁడ వని, విని నీ నిమిత్తమై యిచట వేఁచి యున్నారము. మాకొకవాక్యము దానముఁ జేయుము.

అ—కం. దానమునఁగాని శాత్రవ, దానంబునఁ గాని యీపృథాసుతుఁ డెపుడున్
బూనఁడు సందేహం బను,మానము మానుండు విప్రమండనులారా! ౫౭

ఇఁక వాక్యదానంబునకా జంకెదు?

బ్రాహ్మ—వాక్యదాన మనినఁ జేసెద ననిమాత్రము చెప్పుట యా?

అర్జు—మాట చెప్పి చేయకున్న ననృతదోషము గాదా? అర్జునుఁ డిదివఱ కనృత మాడినది లేదు. ఇఁక నాడువాఁడును గాఁడు.

కం. మాటయుఁ జేఁతయు మనమును, సూటిగ నొకరీతి నుండు సుజనుల కెందున్
మాటయుఁ జేఁతయుమనమును, మూఁటికి ముత్త్రోవ చెనఁటిమూఁకలయందున్.

బ్రా—మేలు మేలు. మేము సర్వతీర్థముల సేవించితిమి. ఇందు నైదుతీర్థంబు లున్నవి. అవి మాబోఁటిదుర్బలులకుఁ జొరరా కున్నవి. మమ్మందుఁ దీర్థ మాడింపుము. స్నానఫలపుణ్యంబునఁ జతుర్థాంశంబుఁ బొందుము. సర్వతీర్థంబులు సేవింప సంకల్పించిన మేము వ్యర్థసంకల్పులము గాకుండఁ జేయుము.

అర్జు—ఏల చొరరాదు?

బ్రాహ్మ—మార్గము దుర్గమము. కంటకావృతము.

అర్జు—మీరు మాతోడ రండు. త్రోవఁ జూపుదును

బ్రాహ్మ—తీర్థము దాఁక వచ్చెదము. స్నానము చేయుటయందు నీవే ముందు.

అ—బ్రాహ్మణులారా! భయపడకుఁడు. నేనుగూడ నుండిమిమ్ముస్నానముచేయించెద.

విశారదుఁడు—అర్జునా ! మాట నీయకుము. అవి తీర్థమాడఁ దగవు.

బ్రాహ్మ—ఓపానకములోని పుల్లా ! నీవు దాతలయొద్ద నుండఁ దగవు.

అర్జు—విశారదా ! యేల ? అవి పుణ్యతీర్థములు గావా ?

విశా—పుణ్యతీర్థములే అందు మొసళ్లున్నవి.

బ్రాహ్మ—అర్జును నొద్ద నీ వున్నట్లు.

విశా—బ్రాహ్మణాకృతీ ! నీ వవివేకప్రభువులయొద్ద మంత్రివిగా నుండఁ దగుదువు. తెలియనివారిని ఘోరకార్యమునకుఁ బ్రేరించెదవా ! వానియం దజయ్యాంబులైన మొసళ్లుంట వినలేదా ?

బ్రా—మొసళ్లున్నవనియా పాండుపుత్రు బెదరించెదవు? ఆయన నీబోఁటి పిఱికి బాఁపడు కాఁడు సుమా. మొగలిపూలలోనిమిన్నాగమా! గంగయందు మొసళ్లు లేవా ? సింధువునందు మొసళ్లు లేవా ? ముదుసళ్లుసైతము వానియందు స్నానమాడుట లేదా ? మీరెల్ల నందు స్నాన మాడితిరా లేదా ?

విశా—అయ్యా ! మీ దే దేశము ?

బ్రాహ్మ—కాశ్మీరము.

విశా—కావుననే యీమొసళ్లవృత్తాంతము మీకుఁ దెలియదు. తెలిసిన నిట్లు చెప్పుదురా ? అన్నిటిలోఁ గాలుంచి తప్పించుకొన బ్రహ్మాదులకు సాధ్యము గాదు. కాకున్నఁ దీర్థయాత్రాపరు లంద ఱేల వాని వర్జింతురు ?

బ్రాహ్మ—ఏల సాధ్యము గాదు ?

విశా—అవి సామాన్యమకరంబులు గావు. ఒక ఋషిశాపంబున దేవతాస్త్రీ లట్లై యందున్నవారు. శాపగ్రస్తంబులతో నెవ్వఁడు పోరాడు ? వానిని బయట వేయఁగలవానిచే వానికి శాపమోక్షం బగు.

బ్రాహ్మ—ఇవి యన్నియు నీకల్పితములు. తైర్థికులు బ్రాహ్మణు లగుటచేత ధైర్యంబు చాలక వెఱతురు. మే మట్టివారమే గదా.

విశా—కాదు కాదు.

బ్రా—కాకున్నఁ బోనిమ్ము. నీతోడ నాకేమి వాదు? సత్ప్రభువులయొద్దఁ గుక్షింభరులు కొందఱు చేరి ప్రభువుల కేదిరోమేలు చేయువారివలె మాటలఁ జెప్పుచు ననర్థంబులు ఘటింపఁజేసి తుదకు వారి కపకీర్తి కీడు గలిగింతురు. వారిలో నీ వొకఁడవు. (అర్జునుఁ జూచి) రాజకుమారా! నీవేమనెదవు? వెఱచితివా? మఱచితివా? వీరి దుర్బోధనములు తల కెక్కెనా? చెప్పుము. శుష్కవాదము కొఱకా యిన్ని నాళ్లు నీకై యిటఁ గాచి యుండుట? ఆశ లేదేని పోయెదము గాక. నీవుకూడ వీరిమాటలకు లోనైతివిగా! ఔరా! దుర్బోధమహిమ.

రెండవ బ్రాహ్మ—ఓరి వెఱ్ఱిబాఁపఁడా! మన ప్రభువులా? స్వతంత్రులా? వివేకులా? అట్లైన నీదుష్టులు బ్రదుకుట యెట్లురా? ఇట్టివార లెట్టివివేకిప్రభువు నైన దుష్టభార్యాశాలీనుఁడగుపతిం బోలె సమయ మెఱింగి యుక్తిశక్తిచే నపూర్వవివేకిఁ జేసి యాడించుచుంట మనకు వింతా? ప్రభువులకా నేత్రవ్యాధి పైత్యరోగము సహజములు. ఎవ్వఁడో నిరోగి యేయింట నొకఁడు.

మొదటిబ్రా—అర్జునుఁ డసత్య మాడఁడురా. ఏల తొందరపడి పలికెదవు?

రెండవబ్రా—ఇదివఱ కసత్యమాడలేదు. ఇఁకనాడఁడ నాడ నని కదా చెప్పెను. వర్తమానము గుఱించి చెప్పెనా?

విశా—కలియుగంబున నీవు పశువాదివిగఁ బుట్టుము.

రెండవబ్రా—అప్పుడు నీవు నాచేతఁ జిక్కెదనా ........................

అ—(స్వ). నాకొకశుభంబుఁ గూర్చెద నని యులూపి యేజలచరంబులచేతను భయము లేకుండ వర మిచ్చెను. ఇఁక నాకేమిభయము? సర్వతీర్థసేవ నేనును సంకల్పించితిఁ గాదే. వీనిని విడనాడి యెట్లు పోవచ్చును? బ్రాహ్మణులకే యింత పట్టుదల యున్న క్షత్రియుండ నగు నాకుండుట విపరీతమా? మఱియు నాస్త్రీల నాపదనుండి తప్పింపవలయుటే ముఖ్యము. ఆర్తులు సర్వదా రక్షణీయులు. (ప్ర)

కం. ప్రేమాస్పదచిత్తులకే, భూమిసురా! మదుల భయము పుట్టుచు నుండుఁ

బ్రేమ కొలంది; మదీయ,స్తోమము నాహితముఁ బలుకఁ దోషంబగునే? గా

కావునఁ గోపగింపకుము. ఈతీర్థము పేరేమి?

బ్రాహ్మ—సౌభద్రతీర్థము.

అ—(స్మృతి నభినయించి) (స్వగతము) సుభద్ర - సౌభద్రము. అవశ్య సేవ్యము. (ప్ర) పోదము రండు. బ్రాహ్మణులారా? నేనిందు ముందు స్నానమొనర్చి పదప మీాచేఁ జేయించెద. నా వెంట రండు.

బ్రాహ్మ—ఇదిగో వెంటనే యున్నారము.

(అర్జునుఁడు నీట దిగఁబోవును. తీర్థవాసిబ్రాహ్మణుఁడు కోపము నటించుచుఁ బ్రవేశించి)

తీర్థ—ఎవఁడా వాఁడో రునినటులెఁ దీర్థంబున స్నానమాడఁ బోవువాఁడు?

అర్జు—అయ్యా నే నర్జునుఁడ.

తీర్థ—అర్జునుఁడా దుర్జనుఁడా? లోభీ! నే నీతీర్థమును గాచికొనియుంట యెఱుంగవా? సంకల్పపుఁగాసునైన వెదచి నీరుకోడివలె మునిఁగి పోన యత్నించితివా? కలకాల మిట నెండకు వానకు మంచునకు వెఱవక, పుణ్యాత్ముల యుదారుల యాగమనంబు వేచి, తీర్థంబుల నాశ్రయించి, యుండుబ్రాహ్మణున కొక కాసు నీవలయు నన్న నింత దుఃఖమా?

అర్జు—బ్రాహ్మణోత్తమా! లోభిని కాను. నూఱుసంవత్సరములుగ నిది జనపవిత్రంబు కాదని వినట నిట్టివ్వ రుండరని తలంచితి.

తీర్థ—(మాఁడిపడుచు) ఏమీా పాఁడిగలటనంబులఁ జెప్పఁగ నాసించి నట్టినవో నాపునకు మేపు వేయునిపట్టుఁడ వని తలంచితివా? ఆశ్రయవిశేష మెఱుఁగని నీచుఁడ నేను గాను.

అ—బ్రాహ్మణోత్తమా! కోపింపకుము విప్రశాపహతి దేవతాస్త్రీలిందు మకరంబులై యున్నవారని విని వారికి శాపమోక్షంబుఁ గావింపత్వర నీట దిగితి పొదలో నున్న మిమ్ముఁ గననైతి

తీ—కోపింతునా మఱి శపింతునా. స్త్రీలనిమిత్తమై పోయెదవా? తెలిసె. కామాంధునకు మేము కానవత్తుమా? తపస్సుచేసికొనువిప్రులు నిర్జనస్థలంబుల నొంటరిగ నుండక (అరచేయి నిలువుగ నడ్డముగ నాడించుచు) దొడ్డరాచబిడ్డఁడవు వచ్చుచున్నాఁడ వని యెదురుగ రావలయునా? నీవచ్చువార్త యందఱ కెఱుంగునట్లు నడుమునకు గంటలు కట్టుకొని రారాదా? నీగుట్టు తెలిసెను. సుందరుఁడ వగుట స్త్రీలకై పరువు పాఱుచు మమ్ముల్లంఘించితివి. నీసౌందర్యగర్వము నాశము కాఁగా దుర్జ్ఞానం బగువికారరూపము వహింపుము.

అర్జు—నిష్కారణక్రుద్ధవిప్రశాపంబుఁ బరిగ్రహించితి. నిష్కళంకభూతదయాబుద్ధి నా యొనర్పఁ బూనినకార్యం బకార్యంబుగ నీకుఁ దోఁచుట నాదురదృష్టఫలము. నీవు బ్రాహ్మణుఁడవు. నిన్నేమియు ననఁ జాల. నీ వింతకు ఘోరంబుగ శపించినను నేను శాపగ్రస్తుల మోక్షితులఁ జేయకుండ విడువ. శాంతుండ వైనీయొనర్చిన కార్యమునకు నీవే పరితపించు చుందువు నీ కదియే శిక్ష.

తీ—హా! చెడితిని. అర్జునా! క్షమింపుము. రాక్షసావేశంబున నాడాసు నల్లితి. తపంబు నాశన మొనర్చికొంటి. నీ వొనర్పఁ బూనిన కార్యము నాకు బాధాకరం బయ్యెఁ గోపాంధూడ నై శాప మిచ్చితి; నన్ను చీఁకొట్టక దయఁ జూడుము? శుభం బగుఁ గాక. పోయి వచ్చెద. (నిష్క్ర-)

అర్జు—(స్వగతము)

తే. సకలసన్నుతి వైనమా దక్కవలసెఁ, గాసి గర్వ్యపిశాచోపహాసంబుఁ దాల్చి,
ధాత్రిజనులకుఁ బరిహాసపాత్రమగుచు, బరువుపెంపును లేనియా బ్రతుకు కేల?

యోగబలమున దేహము విడుతునా? ఎట్లు విడుతును? సంవత్సరప్రతంబు సలుపఁ బ్రతిన బూనియుంటినే. ఎట్లు సల్లాపము! శుభాశుభంబులు, లాభాలాభంబులు, కర్మానుసారంబులు వానికై బుద్ధిమంతుఁడు వగవఁడు. అగునదికాక మానదు. పూనిన కార్యము నెఱవేర్చెదఁ గాక. (నీళ్లలోఁ గొంచెము దిగుట నభినయించి ప్ర) ఆహా! మకరము నన్నాకర్షించుచున్నది. (అని నిలువఁ ద్రొక్కుకొనుట నభినయించును.)

బ్రాహ్మ—అర్జునా! భయపడకుము. మేము తోడ్పడెదము. (అని సమీపించి యర్జును నీళ్లలోఁ ద్రోచి మాయ మగుదురు)

విశా—హా! మోసము మోసము. (అర్జునుఁడు మొసలి నీడ్చి యుడ్డున వైవ నది స్త్రీయై)

వర్గ—జయము జయము విజయునకు. పాండునందనా! మావృత్తాంతము నీవు వినియ యున్నవాఁడవు ఇఁక నేను జెప్ప నేల?

అ—నిర్జరీ! మీచరిత్రము శోచనీయము. ఇఁక నైన నకార్యంబులఁ బ్రవర్తింపకుఁడు.

వర్గ—నిప్పుఁద్రొక్కినవాడు బూదిఁ ద్రొక్క జంకకుందురా? అర్జునా! మానిమిత్తమై నీవు శాపగ్రస్తుఁడ వైతివి. సహజత్వంబు మాఱిన వికారం బగు. కావున నీవు

వ్రతాంతంబున నొక్కమాసంబు సన్న్యాసివై యెవరికి గుర్తింపరాకయుఁ దేజో యుతుండవై యుండుము. సతీగర్భితుండ వగుటకుఁ గా నిన్నట్లనేఁడు శపించె; నీశాస్వరూపంబే సతీలాభప్రాప్తికిఁ గారణం బగు నీ వలసినప్పుడు మమ్ముఁదలం పుము. అదియైచ్ఛికం బగు. నాచెలు లిక నల్వురున్నవారు. వారి నుద్ధరింపరమ్ము.

అర్జు—అవశ్యము. బ్రాహ్మణులారా! పోదము రండు. (అందఱు నిష్క్రే)



## ద్వితీయాంకము – తృతీయరంగము.

(ద్వారక-సుభద్రామందిరము)

శారద—(స్వగతము.) ఇంద్రప్రస్థంబునకుఁ బోయి వచ్చినది మొదలు మాసుభద్రా దేవికిఁ జిత్తంబు స్వాయత్తంబు గాకున్నది. కారణ మేమో? తా నొకపటము వ్రాసికొని రహస్యముగ దాఁచి యెప్పుడు దానినే చూచు చున్నది. పటమును మఱుఁగున నుంచి యేమి జరుగునో చూచెదఁ గాక. (అని అన్నును పటమును దాఁచి మఱుఁగును. సుభద్ర ప్రవేశించి వెదకు చుండును.)

సుభద్ర—శారదా! శారదా!!

శారద—(తెరలో) ఏమక్కా!

సుభద్ర—ఇటురా!

శారద—వచ్చితి.

సుభద్ర—వచ్చితి నని చెప్పుట యొకసారి, వచ్చుట యొకసారియా? వేగము రమ్ము.

(శారద మెల్లగ వచ్చును.)

సుభద్ర—ఏమి పెండ్లినడకలు నడిచెదవే? త్వరగ రమ్ము.

శా—మా యక్కగారికిఁ బెండ్లి. నడక నేర్చుకొను చున్నాను. ఏమి తొందరకార్య మా? పెండ్లికొడుకు వచ్చి యూరిబయట దిగియున్నాఁడా?

సుభ—నే నిక్కడ నొకపటము వేసి యుంటినే, ఏదీ?

శారద—అక్కా! నీ విదివఱకుఁ జక్కనినడవడిగలదాన వని తలఁచి యుంటిని. నీ కపటము నా కేమి తెలియును?

సుభద్ర—అడిగినదాని కుత్తరముఁ జెప్పుము.

శారద—అడిగినది సుభద్రాదేవి. ఆమెకే యుత్తరము చెప్పితిని.

సుభ—పట మొక్కటి యిక్కడ వేసియుంటినే. అది యేది? అర మైనదా?

శారద—నా కర్థము కాలేదు. చీరా? రవికా?

సు—వగలమారీ! పట మనఁగా వస్త్రము గాదే చిత్రపటము అదిపోయిన నా ప్రాణ ముమీఁదికి వచ్చును.

శారద—పంచాంగము పోయినఁ జుక్కలు పోవునా? ఆపటము పోయిన మఱియొ కటి వ్రాయుము. నీ కానేర్పు కలదు కదా.

సుభద్ర—నీప్రసంగము చాలును. పటముఁ దెమ్ము.

శారద—ఆపటమున నుండువా రెవరు?

సుభద్ర—(చిఱునవ్వున) సాత్యకిగురువుగారు.

శారద—ఆయన యెవరు?

సుభద్ర—మామేనత్త కుంతీదేవిగారి కుమారుఁడు.

శారద—పేరు?

సుభద్ర—పేరెట్లు చెప్పుదునే. మొదటి యక్షరము "వి" నీవే తెలిసికో.

శారద—విఘ్నేశ్వరుఁడా?

సుభద్ర—కాదే

శారద—తెలిసెఁ దెలిసె, వినాయకుఁడు.

సుభద్ర—ఛీ. విజ (అర్థోక్తి జంకును.)

శారద—విజయుఁడా? దీనికా యింత జంకితివి?

సు—వారివరుసలు గణింపక పెద్దవారలఁ బేరఁ బిలువవచ్చునా? అదట్లు లుండనీ నాపటమును దెమ్ము.

శారద—నీప్రక్కనే యున్నది.

సుభద్ర—ఎక్కడ?

శారద—చక్కఁ జూడుము.

సుభద్ర—ఏది? ఏది? (అని తన నలుప్రక్కల వెదకును.)

శా—అక్కా! యనినఁ గోపము వచ్చునేమోకాని మగనిఁ బ్రక్కనుంచుకొని దేశ మంతయు వెదకఁబోవుదానవే నీవు.

సుభద్ర—అవునే నీవు కావా? అబద్ధములు చెప్పకుము.

శారద—నిన్ను మీయన్న దుర్యోధనున కీయ నిశ్చయించినాఁడుగా.

సుభద్ర—(కొంచెము విషణ్ణయయి) ఏమీ? ఏమంటివే?

శారద—ఉన్నమాట యంటిని.

సుభద్ర—(కొంచె మాలోచించి) తీర్థయాత్రఁ జేయుచు నీవీరుఁ డిచటికి వచ్చెనా?

శా—మేనరికము చొప్పునఁ దన కీయవలసిన కన్నియను దనవిరోధి కిచ్చుచుండ వారెవ్వ రేల వత్తురని మీవదినెగారు లనుకొను చుండిరి.

సుభద్ర—ఇప్పు డీసన్న్యాసివేషమునఁ గన్నవాఁడు తెలియునా?

శారద—నా కేమి తెలియు నమ్మా నన్నుఁ బీడించెదవు.

సు భ—నీతో సంభాషణము నాకుఁ దలనొప్పి కలిగించుచున్నది. దూరముగఁ బొమ్ము. నన్ను మాటలాడింపకుము.

శా—(స్వ) ఈమె మనస్సు తెలిసెను. దైవ మేమి చేసెనో? ఈమెనయ మింకను వివాహంబు నాయెడ. (నిష్క్రమించును)

సుభద్ర—దైవమా!

తే. ఆవ్యాళిమునఁ గ్రోలఁ గోరుచుండఁ దత్తమూర్తితోఁ, నాత్మస విద్యోగ్యాప్తి సుధాంశయుండ
హాలహాలము జనించినట్టు లయ్యె, నీసుయోధనువార్త నే నెట్టు లోర్తు నింక

ఇది నిశ్చయముగ దుస్సహము. నే నేకాంతంబున నామనోహరు నిందు రప్పింప నాలోచించెదఁ గాక. (నిష్క్రమించును.)



# సుభద్రావిజయము.

## తృతీయాంకము - ప్రథమరంగము.

(రైవతకాద్రి.)

అర్జు—(సన్న్యాసివేషంబున) సంవత్సరవ్రతము ముగిసెను. తోడవచ్చినవారినెల్ల నూరికిఁ బంపితి. విప్రశాపం బనుభవించుచున్నాఁడను. ఇఁక నేది కర్తవ్యము?

చం. సులభము దుష్కరం బనుచుఁ జూడక, బాలిక నన్వరించునో
వలవదొ యంచు సందియముఁ బాటును గానక, సాధ్యమార్గముం
దలఁపక, కార్యభంగ మయినం దలవంపు లటంచు నెంచ, కేఁ
జలుకపటాశరాతుత్వరఁ జే నిటు వచ్చితిఁ దాప మందఁగన్. ౬౧

శాపముగాక మఱి యే ఫలము గలుగఁ గలదు? ద్వారకకుఁ బోవుట యెట్లు? సుభద్రతో సంభాషించు టెట్లు? మాటలాడిన మాత్రమున నన్ను వలచునా?

చం. వలువలు లేవు కట్టుకొనఁ వల్కలఖండమె గాక, మీఁదికిన్
వలిపము లేదు జంకదయుఁ జేనం బిది యొక్కఁడెగాక, క్రమ్మఱం
గలపము లేదు చూడిదయుఁ గాక, తినం దిరిపెంపులన్నమే;
వలచునె రాచకన్నె ననుఁ వంటి బికారి వికారరూపినిన్? ౬౨

వలచినను రహస్యంబుగ నపహరించు టెట్లు? కార్యభాగము సమీపించు కొలఁది మనస్సు పరిపరివిధములఁ బోవు చున్నది. సుభద్రయా నన్నాకర్షించు చున్నది. ఇది యొక పిచ్చియూహ. నేను బోకున్న సుభద్ర నన్నుఁ జేయి పట్టికొని పోవునా? మనోబలం బంతకన్నఁ దక్కువది గాదు. ద్వారకకుఁ బోయెదఁగాక. పోయి? కలదు గదా దేవతా స్త్రీవరము. సాహసమే లక్ష్మ్యాశ్రయావాస ప్రదేశము. ద్వారక నుండి యెవరైన వచ్చుచున్నారేమో. అటుపోయి చూచెదఁగాక. (ఇటు నటుఁ బరిక్రమించి) ఈవచ్చువాఁ డెవఁడు? నాసారథి సుకేతునివలె నున్నాఁడు; రిత్తతేరిఁ దోలుకొని పోవుచున్నాఁడే? ఎచ్చటికో? సమీపించి యడిగెదను. (కొంచెము ముందు నడచి) సుకేతా! సుకేతా!! యెక్కడకుఁ బోయెదవు?

(రథముతోడ సుకేతుఁడు ప్రవేశించును.)

సుకే—అయ్యా! నమస్కారములు. నన్ను మీ రెట్లు తెలుఁగుదురు?

అ—(స్వ) శాపబలము. గుర్తింపలేఁడు. (ప్ర) నిన్ను నే నెఱుఁగుదు. ఎక్కడ కేగెదవు?

సుకే—మాయర్జునమహారాజుగారి వెదకుచుఁ బోవు చున్నాడను. మీరు వారిని జూచి యుండినఁ జెలుపుఁడు. ఆయనతోడి బ్రాహ్మణులు ప్రభాసతీర్థము నుండి ద్వారకకుఁ బోయినట్లు చెప్పిరి. నే నచ్చటికేఁ బోవుచున్నాను.

అ—తొందర కార్యమా?

సుకే—అవును.

అ—అందఱు బాగున్నారా?

సుకే—అందఱు బాగున్న నాకీకష్టమేల? అయ్యా! ముచ్చట లాడ నవకాశము లేదు. తెలిసినఁ జెప్పుఁడు. లేకున్నఁ బోయెదను.

అ—(స్వ) ఏదియో వైపరీత్యము (ప్ర) సుకేతా! నేనే యర్జునుఁడను. శాపంబున నిట్లైతి. కార్య మున్నఁ జెప్పుము.

సుకే—ఎట్లు నమ్మెదను?

అ—ఆనవాళ్లు చూడుము.

సుకే—(అఱచేయి చూచి) ఓరా! శాపబలము. ఏమియు రూపము గుర్తింపరాక యున్నది. (దుఃఖ స్వరములో) రాజేంద్రా! మీయన్నగారు......(అనియర్ధోక్తిఁ దడఁబడును.)

అ—(దీనస్వరమునఁ దత్తఱపాటుతో) సుకేతా! ఏమి మాయన్నగారికి? మాయన్న గారి కేమి?

సుకే—(కన్నీళ్లతో) మీయన్నగారు లే ... (అని పత్రిక చేతఁ బట్టుకొని గట్టిగ నేడ్చుచు) మీయన్నగారు లే......

అ—ఏమీ? మాయన్నగారు లేరా? చెప్పుము. ఏమది?

సుకే—(ఊర్ధ్వముగఁ దల యాడించును.)

అ—ఏమిది? అన్నగారులేరా? నేను జెప్పినది కాదా? (అని పత్రికఁ దీసికొనును)

సుకే—అన్నగారు లేఖ నిచ్చిరి.

అ—(పత్రికఁ జదివి) హా! తల్లీ! (అనిక్రిందఁ గూలఁబడును.)

చం. కటకట ! యెంత దుర్దినము ♦ కర్ణకఠోరము లైనవాక్యముల్
పటుతర తీక్ష్ణశూలముల ♦ భంగిని వీనులఁ జొచ్చె, దైవమా !
యటమట మెంత చేసితివి ♦ హా జననీ ! మముఁ బాసిపోయితే?
కుటిలత నొందెఁ గాల మిటు ♦ క్రూరవిధాతృని చెయ్వి నక్కటా ! ౬౩

సీ. తల్లిరో ! యనుచుఁ బ్రాతఃకాలవందన, మెవరికి నొనరింతు ♦ నింకమీఁద ?
నమ్మరో ! యనఁగ నా ♦ యన ! యని సంప్రీతి, నెవ రాదరింతురే ♦ యింకమీఁద?
జననిరో ! యనఁగనే ♦ జనవున ముచ్చట, లెవ్వరు నొడివెద ♦ రింకమీఁద ?
జనయిత్రి ! యని ధర్మ ♦ సందేహ మడిగిన, నెవ్వరు చెప్పెద ♦ రింకమీఁద ?
తే. నమ్మరో ! యని యెవ్వరి ♦ ననెడివాఁడఁ ?
దల్లిరో ! యని యెవ్వరిఁ ♦ దలఁచువాఁడఁ ?
బేర్మి జననీ ! యటం చెవరిఁ ♦ బిలుచువాఁడ ?
నమ్మ లేనట్టిబిడ్డల ♦ మైతి మకట !

కం. జని యుంచితి వరకులమున, మనితివి ప్రాణంబ వగుచు ♦ మాతండ్రికిలన్
దనయుల ముగ్వురఁ గంటివి, కనకమ్మవు[1] గావె పుణ్య ♦ కాంతలలోనన్. ౬౪

నిండుజాలున నీ వొకసారి కడప దాటిన యప్పైనఁ దీర్పఁగలమా? మమ్ముఁ గన్న తరువాత నైన నేమి సుఖపడితివి ? కలకాల మడవులలో గుట్టలలో మాతోడఁ బడరాని పాట్లెల్లఁ బడితివి గదా అని తలఁచుకొలఁది దుఃఖ మతిశయించుచున్నది. అందలొకమె త్తగస్సుఁ డొకమె త్తన్నట్టులు నన్నుఁ దీర్ఘయాత్ర కై యనుపలేక యశ్రుపూర్ణనేత్ర వై, దీనవదన వై యున్నవిధంబుఁ దలఁచిన వేదన యాఁపరాక యున్నది. నేను జీవిత నై యుండ మరలు మంటివి. నాయట్టి నిర్భాగ్యుఁడా మాతృశాసనము నెఱవేర్చువాఁడు? ఎంతపాపిని సుకేతా ! పదార్థము నష్టమైనపుడు గాని దాని ప్రయోజన మెఱుఁగఁబడదు. నాకు మనస్సు వికలిత మగుచున్నది. ప్రజ్ఞ దప్పుచున్నది. (అని నేలఁ బండుకొనును )

సుకే—(స్వ) అతిభ్రమణంబున బంగరంబువలె నతి మతిభ్రమణంబున నితఁడు నిశ్చేష్టుఁ డయ్యెఁ. నా కిదే సమయము. (అని కత్తి దూయును. ఇంతలో నర్జునుఁడు లేచి)

అ—సుకేతా! ఏల కత్తి దూసితివి ?

సుకే—నీస్థితి నాకు దుస్సహము.

---

1 కనకమ్మవు=1 బంగారమవు. (2) ఈగ్రంథకర్త తల్లిపేరు కనకమ్మ. ఆమెకు ముగ్వురు కొడుకులు. వారిలో నీతడు మధ్యముఁడు. ఇది స్వమాతృ దుఃఖము.

అ—సుకేతా? మాతల్లిని నేను మరలఁ జూడఁ గలనా?

సుకే—ఇం కెక్కడితల్లి? లెమ్ము! (అర్జునుఁడు రథమెక్కును అర్జును తేరు కొంచెము దూరముపోవ వృద్ధబ్రాహ్మణు చేయిపట్టి బాలకుఁడు పిలుచుకొని పోవు చుండును.)

బ్రా—యతీశ్వరా! ఎచ్చటికిఁ బ్రయాణము?

అ—ఇంద్రప్రస్థపురంబునకు.

బ్రా—అయ్యా? సన్న్యాసిరాజా! సర్వభూతదయాపరా! నీవు సన్న్యాసి వై రథ మెక్కి పోవుచు గ్రుడ్డిముసలిబ్రాహ్మణుని, నడువలేనివాని, నుపేక్షించుట న్యాయ్యమా? [1] మేము కొంచెముదూరంబున నున్నపల్లెకుఁ బోవువారము. మ మ్మింతదాఁకఁ బిలిచికొని పోయెదవా? (అని కాళ్లు వడఁక నిలుచును.)

సుకే—(స్వ) నాపాలిటి మృత్యువుగ నీబ్రాహ్మణు లెక్కడ వచ్చిరి? (ప్ర) మేము త్వర త్వర పోవలయును. మీ దొకజంజాటమా?

అ—సుకేతా! బ్రాహ్మణులు. ఒకఁడు బాలుఁడు, ఒకఁడు కడుముసలి. నడవలేరఁట. రానిమ్ము.

సుకే—మంగలిని జూచిన నక్కయుఁ గుంటును. ఈతేరు లేకున్న వీ రెట్లుపోయి యుందురో ఇంతకుఁ దేరియం దింద ఱకు నెడ యేది?

అ—పీఠమున నిద్దఱు నీస్థానంబున నొకఁడు చక్రరక్షకస్థానంబున నొకఁడు.

సుకే—బ్రాహ్మణులారా! మీరు తేరు త్రోలఁ గలరా?

బ్రా—చలిపందిలికుండలలో నీలు వేయువాఁడా? మేము బండిత్రోలి బ్రదికెడివారము గాము.

సుకే—ఈబ్రాహ్మణుల కయ్యో యనిన నాలుగునెలలపాపము కూడ వచ్చును. వీరి కెంతనోటిదురుసు.

అ—సుకేతా! బ్రాహ్మణులకు మనసు వెన్న.

సుకే—మనస్సు వెన్న బుద్ధి సున్న. ఎదుటివారికష్టసుఖము లాలోచింపరు. కావున నే యాచకునకు యమధర్మరాజునకును సమయము దెలియ దనునానుడి. నే నెక్కడఁ గూర్చుండుదును?

అ—నీవు చక్రరక్షకస్థానంబున వీరు పీఠంబున. నేను నీస్థలమున.

సుకే—నాస్థానంబున నేనే కూర్చుండుదును. వీరు వెనుకప్రక్కఁ గూర్చుండ రాదా?

బ్రా—మర్యాదాహీనుఁడా! మేమా వెనుకప్రక్క? జాతికిఁదగినబుద్ధి యేల వదలును?

1 యానారూఢం యతిం దృష్ట్వా సచేలస్నానమాచరేత్. వాహనమెక్కినసన్న్యాసిని జూచిన కట్టుగుడ్డలతో స్నానము చేయవలయును.

జ—పీఠంబున వారినే కూర్చుండ నిమ్ము.

బ్రా—మేలుమేలు. బ్రాహ్మణగౌరవము రక్షితము. (అపవారితము) సర్వము మన కనుకూల మైనది. తుంటరిసారథి వెనుకఁ బడినాఁడు లే.

(అర్జునుఁడు రథము నడపును. బ్రాహ్మణులు ఖడ్గము గొంచెము దూయుదురు. అర్జునుఁడు తిరిగి చూచును. బ్రాహ్మణులు ఖడ్గము దాఁచుదురు.)

అర్జు—బ్రాహ్మణోత్తములారా! మీపే ర్లేమి?

శారద్వ—శారద్వతుఁడు.

అ—ఎక్కడ కేగెదరు?

శారద్వ—అనతిదూరమున నుండుమాగ్రామంబునకు.

(అర్జునుఁడు రథము నడపును బ్రాహ్మణులు ఖడ్గముల దూయుదురు. అర్జునుఁడు మరలి చూచును. బ్రాహ్మణులు ఖడ్గము దాఁచుదురు.)

అర్జు—బ్రాహ్మణబాలకా! నీపే రేమి?

బ్రాబా—(కోపముతో) పేరు పెద్దయ్య. ఇవు డాప్రసంగ మేల? నీకుఁ బనిమీఁద దృష్టిలేదు. మామొగములఁ గ్రోఁతు లాడుచున్నవా? తిరిగితిరిగి చూచెద వే? నీవు మామొగములఁజూచుచుండుము. గుఱ్ఱములు తేఁని గుంతలోఁ ద్రోసి బ్రహ్మహత్య నీమెడఁ గట్టును. (అర్జునుఁడు రథము నడపును.)

సుకే—(స్వ) ఈబ్రాహ్మణులు నాకెక్కడ దాపరించిరి. ఎట్లు వీరిని దలఁగఁద్రోసి నాకార్యము సాధింతును. (అని తొంగి చూచును. బ్రాహ్మణు లిరువురు ఖడ్గములు దూసి యర్జునుశిరముఁ దెగవ్రేయ గమకింతురు. నారదుఁడు ప్రవేశించును. అర్జునుడు కుడిచేయి యూఁది క్రింద దుముకును, రథము క్రిళ్లలో నిద్దఱు బ్రాహ్మణులు సుకేతుఁడు నిఱికికొందురు. రథము విఱిగి పడును.)

అ—దేవమునీ! అర్జునుఁడు నమస్కరించుచున్నాఁడు.

నా—దీర్ఘాయుష్యమస్తు. నీవు సన్న్యాసి వై రథ మెక్కితి వేల? కలియుగధర్మము నకు మార్గదర్శి వైతివా?

అ—భగవంతునకుఁ దెలియని దే మున్నది? శాపోపహతుఁడ మాతృదుఃఖపీడితుఁడ.

నా—మాతృదుఃఖమా? కల్ల. మీతల్లిగారు సుఖ మున్నారు. వ్యసనపడకుము. నీవు మరల రైవతకాద్రికిఁ బొమ్ము. నేఁ బోయి వచ్చెద. (నిష్క్రా.)

అ—(మరలి చూచి) అయ్యో పాపము! రథము విఱిగెను. వీరు చిక్కువడిరే విడి పించెదఁ గాక. (అని వారల విడిపింపఁ బోవును. కొందఱు భటులు ప్రవేశింతురు.)

భటులు—విజయరాజేంద్రా! జయము జయము.

అ—(స్వ) వీ రెవ్వరు నన్నుఁ బేర సంబోధించు చున్నారు? (ప్ర.) ఎవరు మీరు?

భటులు—మే ములూపిదేవిగారి సేవకులము.

అర్జు—దేవిగారికి సుఖమా? ఏల వచ్చితిరి?

భ—దేవిగారికి సుఖము. వారియాజ్ఞ చొప్పున వచ్చితిమి. ఈపత్రము మీకొసంగ నాజ్ఞాపించిరి. (అని పత్రిక నిత్తురు.)

అ—(చదువును.) "ప్రాణేశ్వరా! నాయదృష్టము మిమ్ముఁ బ్రాణ పాయము నుండి తప్పించెను. పులులు బోనులోఁ జిక్కెను. వానియందుఁ గృపఁ దలఁపవలదు. బ్రాహ్మణులను సారథిని నీభటుల కప్పగింపుఁడు. ఇఁక మీకు కనిష్టము గలుగకుండ నుపాయముఁ బన్నితి. జరగినదానికి దేనికిఁ గటకటపడకుఁడు. సర్వము శీఘ్రిముగ వేద్యము కాఁగలదు.

ఇట్లు విన్నవించు భవత్ప్రాణేశ్వరి ఉలూపి"

అ—(ఆలోచించి) భటులారా! దేవియాజ్ఞ మేరగ వర్తింపుఁడు. వీరిని గొనిపొండు.

భటులు—చిత్తము. (అని వారల నీడ్చికొని పోవుదురు.)

అ—(స్వ) ఈనాఁటిచరితలెంతయు వింతలు. బ్రాహ్మణు లెవరు? సారథి యెవఁడు? రేకు యంత్రపూరితము గానేల? అందు వారు చిక్క నేల? ఉలూపి యీపత్రిక వ్రాయ నేల? అంతయు గూఢముగా నున్నది. ఇ దంతయు రైవతకాద్రి కేగుచు నాలోచించెదఁ గాక. (నిష్క్రా.)

---

## తృతీయాంకము - ద్వితీయరంగము.

(హస్తినాపురము. దుర్యోధనమందిరము. దుశ్శాసన కర్ణ శకునులతో దుర్యోధనుఁ డాలోచించు చుండును.)

శకుని—మనము నాటినబీజము ఫలకారి యయ్యెనా? సారథి మరలి వచ్చెనా?

దుర్యో—దివ్యమైనఫలముల నొసఁగెను. దుశ్శాసనా! సారథి తెచ్చిన యీఫలము నీవు గుర్తింపఁ గలవా? (అని యొక యుంగరము నిచ్చును.)

దుశ్శా—(దానిఁ జూచి) నాకుఁ జక్కఁగ గుర్తున్నది ఇది యతనిదే. ద్రుపదుని బట్టుకొనివచ్చినపు డతఁడు ద్రోణునకుఁ గొంతరాజ్య మిచ్చుచు నర్జును సాహసంబునకు మెచ్చి విజయుఁ డని పేరు చెక్కించి యీయూర్మిక తాన యతనివ్రేల నిడెను. ఇది యతనియర్ధాంగలక్ష్మి కుపలక్షణముగ దీని నీవ్రేల నేను దొడిగెదను.

శకుని—కర్ణా! యిప్పు డేమిఁ జెప్పెదవు?

క—హా! నా కెట్టిదుర్దిన మిది. ప్రతిపక్షతర్జనుఁ డగునర్జునునితోఁ బోరి జగదేకవీర విఖ్యాతిఁ గాంక్షించిన నేను నతనివలెఁ గీర్తిరహితమ్మృతి నందవలసి వచ్చెను. ఇఁక నెవ్వరి రణమున గెల్చిన నట్టికీర్తి రాఁ గలదు. దుర్యోధనా! నా కెంత యుపకార మొనర్చితివి.

దుశ్శా—కార్యము సుకరమైనందునకు సంతసింపక తోడఁబుట్టునకుం బోలెఁ దపించెద వేమి?

శ—స్వప్రతిష్ఠ కయి తమ్ము నేలినవారి నష్టకష్టముల పాల్సేయుస్వకార్యధురంధరు లిట్టివారే. కాకున్నఁ గలహమునకే బుద్ధిమంతుఁడు కాలుద్రవ్వునా?

కర్ణుఁడు—(శకుని నుఱిమి చూచును.)

దుశ్శా—మఱియొక యాలోచన యేమైనది?

దుర్యో—అదియును బండే.

కర్ణుఁడు—బండా?

దుర్యో—కాదుకాదు పండు. ఈయుత్తరముఁ జూడుము.

దుశ్శా—ఓహో! ముహూర్తము నేఁటికి సమీపముననే యున్నదే? మనము రేపు పయనింపవలసినదే.

కర్ణుఁడు—ఇవి మృతాశౌచదినములు గదా?

దుర్యోధ—అది మనము వెలిపుచ్చిన నింద మనయంద యారోపింపఁబడు. దొంగకుఁ దేలు కుట్టిన ట్లుండుఁను. ఇప్పుడ చెప్పిన రెండవకార్యము నెఱవేఱును.

దుశ్శా—జీవించియుండఁ జచ్చినారని శ్రాద్ధము లొనర్పరేదా?[1] ఇప్పుడు పరివృత్తి

దు—బాగు. అటు కాదేని యతఁడు చచ్చియుఁ గార్యసాధకుఁడే యగు. తమ్ముఁడా! ప్రయాణసన్నాహ మొనర్పుము. కర్ణా! బుద్ధికి మించినది లోకమునఁ గలదా? బుద్ధిహీనులు కార్యహానికి దైవము దూఱుదురు. నామతంబుననో

---

1 లక్కయింటఁ జచ్చినారని.

తే. బుద్ధిబల మొక్కటియె యగుఁ ♦ బురుషబలము
పౌరుషము నాశ్రయించి దై ♦ వంబు తిరుగు
దైవమున కెట్టు లేదు స్వా ♦ తంత్ర్య మెందు
దైవముని నమ్మి యుండిన ♦ దైన్య మొదవు. ౬౬

మనము ప్రయాణప్రయత్నములు సేయఁ బోదము రండు.

(నిష్క్రమింతురు.)

---

## తృతీయాంకము-తృతీయరంగము.

(ద్వారకయందు రుక్మిణీమందిరము. రుక్మిణీసత్యభామ లొకయుద్దిగను, సుభద్రాకృష్ణు లొకయుద్దిగను జదరంగము నాడు చుందురు.)

సత్య—మీలో నెవ్వ రాడువారు?

సుభ—వదినెగారికి స్త్రీపురుషభేదనిర్ణయజ్ఞానమువదలినది. యోగాతిశయ మోనేత్రి[1]

సత్య—ఆ టాడువారే

సుభ—నేను. మాయన్న నాకుఁ దోడు.

సత్య—నీవా నాతో సరిగ నాడుదానవు?

సుభ—కానమ్మా! మీకే యచ్చపుటాఁడువారు.

సత్య—అది గాదే నే ననినది.

సుభ—నే ననినది యది గాదమ్మా!

స—అయిన నాడుము. ఇదో రెండవయెత్తుననే మీరాజునకుఁ దోసిరాజు. చూచుకొ మీరాజుగతి.

కృష్ణ—ఆడుము భయపడకుము. సుభద్రా విజయము మనదిలే.

సుభ—ఇదిగో బంటు నడ్డముగఁ ద్రోసితిని. ఇంకేమి కాఁగలదు?

సత్య—ఈప్రక్కఁ జూడుము. మంత్రి గుఱ్ఱము నీసేన నెట్లు కలఁచెడినో?

సుభ—కానిమ్ము. భయము లేదు.

స—ఇదో తోసిరాజు. ఇదో తోసిరాజు. చూచితివా మీరాజును వదలి మంత్రి సమయవేసి యెచ్చటికో పోయినాఁడు.

సు—ఆపదలు కాఁపురము చేయునా? మీరు చేయఁగల దంతయు ముగిసెను. మాయేకచరుఁడుమంత్రి విడివడి వచ్చుచున్నాఁడు. మీబలముపాటు చూడుము.

---

(1) యోగాతిశయము.

సత్య—రానిమ్ము చూతము.

సుభ—మీరా జెట్లు పరుగువారుచున్నాఁడో కంటిరా?

సత్య—నే నభేద్యంబుగ వ్యూహ మెట్లు కట్టెదనో కనుము.[1]

సుభ—ఇదే నాకిశోరరత్న[2] మొక్కదూఁకున మీవ్యూహమధ్యంబున దూఁకెను.

సత్య—ఏదీ దూఁకనీ ?

సుభ—మీరాజు దిక్కుదోఁపక మూలమూల దాఁగుచున్నాఁడు.

స—ఇదో మానలువురుశూరులు నలుప్రక్కల నావరించిరి. నీకిశోర మెట్లు తప్పించుకొనును?

సుభ—ఒక్కయడుగున మీదుష్టచతుష్టయముమీఁదనే కాదు, వారియాశ్రితుల తలలమీఁదను నాకిశోరరత్నము కాలుంచెను.

సత్య—నీకిశోరరత్నము చిక్కెను. ఇదిగోఁ జచ్చె. ఉబ్బు తీఱెనవా ?

సుభ—అయ్యో! యెటువంటికుమారరత్న మెంతపని చేసి చచ్చెను.

కృష్ణు—హా! మోసము-మోసము.

స—(కృష్ణుఁజూచి) ఏమీ మోసమా? చదరంగంబున మోసము గలదా వారివారి మతిమోసము గాక.

రుక్మి—మనదేవరమాహాత్మ్యము మనకుఁ దెలియదా? అందఱు నిద్రించుపట్టున వీరు మేల్కని యుందురు. అందఱు మేలొక్కన్నయెడ వీరు నిద్రింతురు. దేహ మిచ్చుట మన స్సిచ్చుటనో. వీరివర్తనము విపరీతము గదా ?

స—అవు నక్కా! మీగుట్టు వారికి, వారిగుట్టు మీకుఁ దెలియవలయును. నా కేమి తెలియును. నాపాలిటికిఁ దెల్లని వన్నియుఁ బాలు, నల్లని వన్నియు నీళ్లు.

రు—వినవమ్మా-విను. మున్నొక్కసారె నేను వీరితోఁ బాచిక లాడుచుండి దీవంచ యని పందెము వేయ వీ రమృత మస్తని పందెము వేసిరి.

స—(చిఱునవ్వున) అక్కా! భక్ష్యములని మనవారు పాచికల నోర వేసికొనిరా? లేదుగదా ?

రుక్మి—నేను చేయి పట్టుకొని యట్లనితి రేల? యని ప్రశ్నించితిని.

సుభ—(నవ్వుచు) అన్నగా రేమిచెప్పిరి ?

---

1 ఇది పద్మవ్యూహమున నభిమన్యువృత్తమును సూచించును 2 కిశోరము గుఱ్ఱపుపిల్ల-కొడుకు.

రు—(సత్యతో) అప్పుడు దుర్యోధనుఁడు భీమసేనునకు విషభక్ష్యముఁ జేయారఁ దిన నిచ్చెనఁట. ఆయన యాఁకటి పెలుచఁ గృష్ణార్పణ మని తినియె నఁట. అనిమిత్తముగ విజయాగ్రజునకు నపాయముఁ బాప నమృతమ స్తనిలి నని చెప్పిరి.

స—మనయింటియల్లుఁడు దుర్యోధనుఁడా? ఇది నిద్రించుభీమసేనుని సర్పదష్టుఁ జేయుటకు, గంగలోఁ ద్రోయుటకు ముందా? పోనిం డమ్మా! అక్కా! యాయన విషయము. మనమఱఁదలికిఁ గోపము.....ప్రస్తావింపకుఁడు.[1]

సు—అన్నా! నాకుఁ దల నొప్పిగా నున్నది. ఇంటికిఁ బోయెదను.

స—అక్కా! నేను జెప్పలేదా? (సుభద్రతో) యథార్థ మనిన నింతకోపమా?
(సుభద్ర - నిష్క్రాంత) (దూతిక పత్రికఁ దెచ్చి కృష్ణున కిచ్చును. కృష్ణుఁడు దానిఁ జదువుట నభినయించి)

కృ—రైవతకాద్రికి యతీశ్వరు లెవరో వచ్చి యున్నారఁట. వారిని దోడి తెచ్చుటకు నందఱు పోవలసియున్న దఁట. నన్ను వెంటనే రమ్మని యన్న గారు వ్రాసినారు. నేను బోయెదను. మీరును దగుప్రయత్నముల నుండఁబోండు. (అందఱు నిష్క్రాంతి.)

---

## తృతీయాంకము. చతుర్థరంగము.

(ద్వారక - సుభద్రామందిరోద్యానము, సుభద్ర విచారగ్రస్తయై యుండును.)

సు—చం. వినవినఁగా సుయోధనుని వృత్తములన్ మది తత్తరించెడిన్
దను వెరియంగఁ జొచ్చె గృహదాహకునిన్ విషదాతనాతతా
యిని గుణహీను నెట్టులొకొ యే హృదయేశ్వరుఁ జేయఁ జాలుదున్?
దనమతి నొప్పగాక యుచితంబుఁ దలంపఁడు కామపాలుఁడున్. ౬౭

దైవమా! నాకెట్టికష్టముఁ దెచ్చి పెట్టితివి? నామనోవేదన నెవరితోఁ జెప్పుకొందును? ఎవరితోఁ జెప్పిన నేమిఫలము? బలరామన్న యెవరిమాట సాగనీయఁడు. ఆయన నెవ రతిక్రమింతురు? వెలుగుచేను మేసినఁ గాచువా రెవరు? ఈయన రాజనీతి నాపాలి కీలి యై యున్నది. చిన్నన్న కృష్ణునితోఁ జెప్పుకొందునా? అయన యుదాసీనువలె నున్నాఁడు. ఎంతయున్న నైనను నేనే యీవిషయమై యేమని చెప్పికొందును? వదినెలచేఁ జెప్పింతునా? వా రిప్పుడే చప్పట్లు కొట్టుదురు. కొట్టరా మఱి? ఈదుఃఖము నేనెట్టు లణఁచుకొందును? నా కెక్కుడియున్న దాపరించెను? మాపెద్ద

---

1 సుభద్రకు దుర్యోధనునందు విరక్తి కలుగుటకై యీమాటచ్చుటలు.

§ Subhadra.

వదినె రుక్మిణీదేవిగారి వయసయే నాకు రావలయునా? ఆమెయున్న వంటియున్నయే నాకు దొరకవలయునా? (కొంచెము ఉత్సాహముతో) ఆమె చేసినట్లు నేనును జేయుదునా? అవును. అదియే శుభమార్గము సాహసింపక సుఖములేదు. (కొంచె మాలోచించి సందేహముతో) నే నెవరిని బంపుదు? ఎక్కడకని పంపుదు? సంవత్సరమునాఁడే నాప్రియుఁడు తీర్థయాత్రకై పురి విడిచి చనియె నఁట; ఇప్పు డెక్కడ నున్నాఁడో? సంవత్సరపరిమితి ముగిసి యుండవలయును. ఊరు చేరి యుండునా? అచ్చటి నుండి వచ్చినవారి నెల్ల విచారించు చున్నదానను. ఊరికి రాలే దనుచున్నారు. నేను బంపినవా రెక్కడ నని వెదకుదురు? మాయన్నయా తొందరపడు చున్నవాఁడు. (దీనయై) అయ్యో! వదినె లన్నవార్తఁ దలఁపఁ దలఁపఁ గడుపులోఁ జెయిపెట్టి కలియఁబెట్టిన ట్లున్నదే. నాబ్రదుకు కాకిముక్కునఁ గట్టినదొండపం డగునేమో? (రోషముతో) అగునా? కాఁగలదా? నన్ను దుర్యోధనుఁడు వివాహ మాడునా? (ఈవాక్యమున నొక్కొక్కమాట నొక్కి యొక్కొక్కసారి పఠింపవలయును) మాఁడును గాక. (దీనతతో) రిత్తచింతకంబుల నేమిఫలము?

ఉ. ఎంతటిపుణ్యముల్ సలిపి యేవ్రతముల్ పచరించి, యేమహా
స్వాంతులపాదసేవ ననిశంబును జేసినధన్యలో కదా
కాంతునిఁ, జాతురూపజలకంతునిఁ, గోరినప్రాణనాథు, నే
కాంతముఁ గూడి యాడఁ గలసార్థకజన్మలు రాచకన్నియల్. ౬౮

సీ. అంకునా నేఁబోయి యన్నలారా! మీకు, మర్యాద గా దిది మానుఁ డనుచుఁ?
గంకునా యిదె యేగి కన్నతల్లిని దాయ, దాయనా న న్నిట్లు చేయ ననుచు?
వింతునా నాపకు వెత లెల్ల నాకన్న, తండ్రికినైనను దయ దలిర్పఁ?
బంతునా నాపెంచు కంతు తేజునైన, నారమణునిఁ దోడి తేరలకును?

తే. ఎంతునా విధి? వేల్పు సేవింతునా? త
లఁతునా కృష్ణుఁ? గమ్మ లిఖింతునా? త్య
జింతునా మేను? హరి ధిక్కరింతునా? దు
రంతసంతాప మొదవ నిర్భాగ్యనైతి. ౬౯

ఉ. అక్కట! నామనంబు తెలియంగ నెఱుంగఁడు, పెద్దవారలుం
దక్కటివారుఁ జెప్పఁ జెవిఁ జొప్పఁడు, తద్గుణ మెన్నఁ బోఁడు, భీఁ

డెక్కడియున్న నాకయయొ ♦ యెక్కడ దాపుర మయ్యె మిత్తియై
యెక్కరణిన్ సహింతు? ధృతి ♦ నెట్లు ధరింతు భరింతుఁ బ్రాణముల్.
హాకృష్ణా! (అని చెక్కిటఁ జేయి చేర్చి నిట్టూర్చుచుఁ గనులరమూయును)

(కృష్ణుఁడు ప్రవేశించును.)

కృష్ణుఁడు—సుభద్రా! యేమమ్మా! యేల పిలిచితివి?
సుభద్ర—(ఉలికిపడి) నేను బిలువలేదే?
కృ—ఏమమ్మా! యిపుడు కృష్ణాయని పిలిచితివే. ఇంతలో లేదనెద వేల? విచారగ్రస్తురాలవుగా నున్నదానవే.
సుభద్ర—ఏమి లేదు.
కృ—చెప్పఁ గూడదా?
సు—(స్వ) ఏమైన నన నిమ్ము. సాహసించి చెప్పుమనా? అమ్మయైన నడుగక పెట్టదు గదా? (ప్ర) అన్నా!

(బలరాముఁడు ప్రవేశించి)

బల—కృష్ణా! ఇచ్చటనా యున్నవాఁడవు? సుభద్ర యేమో చెప్పుచున్నదే?
కృ—సుభద్ర నిచటఁజూచి చాలదినము లయ్యెను. చూచిపోద మని యిప్పుడ వచ్చితి.
బల—నీవువచ్చుట నేను జూచితిని ఏమి విశేషము?
కృ—సుభద్ర యేదో విచారములో నున్నది. కారణ మడిగినఁ జెప్పదు.
బల—నాకుఁ దెలియును ఇంత తొందరపడిన నేమి చేయవచ్చును? మాఘము లడ్డము వచ్చెను. అవి రాకున్న నెప్పుడో పెండ్లి యయి మనసుభద్ర యింతకు మహాభాగ్యసంపన్నురాలై మహారాజ్ఞియై మనల మఱచియు నుండును సుభద్రా! యీ పటముతో వినోదించు చుండుము. (దుర్యోధనుపటముఁ జేతి కిచ్చును. సుభద్రదానిని గ్రిందఁ బెట్టి కన్నీళ్లు విడుచును)

కృ—అమ్మాయీ! యేల దుఃఖించెదవు?
బల—ఎంత వెఱ్ఱివాఁడవురా కృష్ణా! నీకింతమాత్రము లోకానుభవము గాని యింగిత జ్ఞానము గాని లేదే? అవి దుఃఖాశ్రువు లనుకొంటివా? ప్రమదాశ్రువులురా. పెండ్లి యనినఁ గన్య లేడ్తురా? ఇంతమాత్రము తోఁపదా?

కృ—అదియా సమాచారము. అమ్మా ! యెంతటిదానవే సుభద్రా !

బల—చెల్లెలా? నీ వేల చింతించెదవు ? శీఘ్రముగా నిన్ను రాజరాజున కిచ్చి వివాహము చేసెదము. నీ వతనిపుట్టపుదేవి వై రాణింపఁ గలవు.

కృ—సోదరీ ! నీవు చింతింపకుము. నీయిష్టప్రకారము నెఱవేర్చుభారము నాది.

బల—కృష్ణా ! మనము రైవతకాద్రికిఁ బోదము రమ్ము. (ఇద్దఱు నిష్క్రమింతురు.)

సు—(కన్నీళ్లు తుడిచికొనుచు) అన్నా ! బలరామా ? యెంతమూఢుఁడవు ! ఎంతటి మూర్ఖుఁడవు ! ఈపాపపుపటమును జూచి దిగులుపడి వణఁకితిని. ఈదుష్టునకా నేను భార్య నగుట యని కన్నీళ్లు గార్చితిని. ఇది ప్రమదాశ్రువు లఁట. ఎట్టిరసజ్ఞుఁడు ! ఇట్టివానికి నే నేమిచెప్పిన నేమిఫలము. చెవిటివానియెదుట శంఖ మూఁదిన ట్లగు. ఇఁకఁ జిన్నన్నప్రవర్తనమో వింతగా నున్నది. ఆయనమాటలవలన నన్నుఁ దా ననుకూలుఁడో ప్రతికూలుఁడో తెలియ లేదు. పోనీ, నేనే సాహసించి యడుగుదునా? అన్నతోఁ బ్రతికూలించినఁ గుటుంబకలహ మగు ననిన నేను జేయవలసిన దేమి ? గరిఁటె నాకి వ్రతముఁ జెఱచుకోవలయునా ? సాహసించి దీనికి నేనే ప్రతిక్రియఁ జేయవలయు ! (అని యోలోచించు చుండును )

( తెరలో ఢమఢమధ్వని.) ద్వారవతీవాసులారా ! వినుఁడు మఱచితి మనఁ బోకుఁడు. జ్ఞప్తియం దుంచుకొనుఁడు. రైవతకాద్రికి నొకమహాత్ముఁడు సన్యాసి వచ్చి యున్నాఁడు. ఆయనను దర్శింప యాదవశ్రేష్ఠులు రేపటియుదయమునఁ బోవుదురు. వారు లందఱు యతీశ్వరు బహూకరింపఁ దగినధనము రావలయును. ఇది రాజాజ్ఞ సుఁడీ. (అని తిరుగ ఢమఢమధ్వని.)

సు—ఇది యొకటి వచ్చెనా? నాచెలులు నన్ను వెదకుచుందురు. పోయెదఁ గాక.

(నిష్క్రమించును )



శ్రీ

# సుభద్రావిజయము.

చతుర్థాంకము—ప్రథమరంగము.

(ద్వారక. సుభద్రామందిరోద్యానంబున లతానికుంజమందు నిమీలితలోచనుండై యతివేషంబున ధ్యానతత్పరుఁడువోలె నర్జునుఁడుండ సుభద్రారుక్మిణీసత్యభామలు ప్రవేశింతురు.)

రుక్మి—(కొంచెముదూరమున వచ్చుచు నర్జునుఁ జూపి) సుభద్రా! రైవతమునుండి తోడితెచ్చిన యల్లవాఁపరిచర్యకే సుమా నిన్ను బావగారు నియమించినది.

సత్య—నీయదృష్టము పనసతొనల జాతితేనెలోఁ బడినట్లయినది. వీరు నిన్నుఁ గృతకౌతుకఁ[1] జేయుదురుపో.

సుభ—వదినా! అన్న చెప్పిన ఋషీశ్వరులు వారా? మహీభృత్కుమారికై[2] తపముఁ జేయు రాజమౌళివలె నున్నారే.[3]

సత్య—మఱఁదలా! సన్న్యాసివేషి నీకనులకు రాజమౌళియా?

సుభ—కాదమ్మా! శంకరుఁ డని యంటిని.

సత్య—ఆయన శంకరుఁడు. నీవు గౌరీదేవివి

సు—(సత్యతో) అదేమమ్మా యట్లు లనెదరు? (రుక్మిణితో) పెద్దవదినే! ఈచిన్నవదినెగారి పరిహాసమునకుఁ జిన్న పెద్ద యనువిచారముకూడ లేదమ్మా. ఏలమ్మా యింతపిన్నవయసున వీరు సన్న్యాసు లయినారు? ఆముఖవర్చస్సు విబుధులకైనఁ గల్గునా.

రు—ఆయన సన్న్యాసి యగుటకుఁ గారణము నీవే యని నాకెట్లు చెప్పవచ్చును. నీవు చెప్పినట్లు ఈతేజస్సు సామాన్యవిబుధుల కుండునా? విబుధపతినందనున[4] కుండునేమో.

సత్య—నీవు పోయి మ్రొక్కుము. నీకోరినమగఁడు వచ్చునట్లు వర మిచ్చును.

సు—మావదినెగారి కెప్పుడు మగనిచింతయే.

---

1 కౌతుకము.=పెండ్లికంకణము. (2) పార్వతి-రాజకుమారి. (3) శివుఁడు-రాజశ్రేష్ఠుఁడు (4) జయంతుఁడు-అర్జునుఁడు.

(అందఱు సమీపించి నమస్కరించి నిలుతురు.)

అర్జు—(కన్నులు విచ్చి) నారాయణ.

రు—మఱఁదలా ! వీరు దేవసములు. నిగ్రహానుగ్రహసమర్థులు, ఉపచరించుట యందుఁ బ్రమాదంబున నేని బాలాత్వంబున నేని యుపేక్షించెదవు సుమీ. నీకు సర్వమువీరే యని నమ్మి పరిచరించి వారేది చెప్పిన నాఁగా దనక చేయుము. నీప్రాణములకంటె నెక్కువగఁ జూచుకొనుము.

సు—నేనేల ప్రమాదపడుదును ? వారిసౌఖ్యమే నాసౌఖ్యము.

రుక్మిణీ—వ్రతీంద్రా! పెద్దవారీకన్యకను మీకై వసపఱిచిరి. 1 స్వధర్మనిర్వాహణార్థము గ్రహింపుఁడు.

ఉ. బాలిక ముద్దరాలు కడు♦పాటున కోర్చినమేనుగాదు, డా
ఖేలనలోల సంతతముఁ♦గీడును మేలు నెఱుంగ నేర, దీ
గోల భవత్సపర్యలను♦ గూడఁ గృతార్థతఁ గావునన్, మహా
శీలక ! కన్నుమిన్న దయ♦చేసి కరంబుఁ[2] బట్టిగ్రహింపుమీ. ౭౧

ఉ. బాలురు వృద్ధులున్ సతులు♦ భక్తిపురస్సరచిత్తవృత్తిఁ గా
ర్యాళులు సంఘటించునెడ♦ నక్షతి నొందఁ, నెఱింగి యుండ, నే
దే లవదోషముం గలిగ♦నేని క్షమింతురు గాని యల్గఁగాఁ
జాలరు సత్యభాషణ ! ప్ర♦శాంతమనస్కులు సాధుసత్తముల్. ౭౨

(సుభద్రంజూచి) నీవు వారిపూజకు వలయునవి సేకరించుము. వారిదేవపూజా వసరమునకు మేము మరల వచ్చెదము. (రుక్మిణీసత్యభామలు నిష్క్రమింతురు.)

సుభద్ర—యతీశ్వరా ! మీ కేమి కావలయు ?

అర్జు—(స్వ) హృదయేశ్వరా యనదుగా (ప్ర) ఏ మంటివి ?

సుభద్ర—యతినాథా ! మీకు ధ్యానభంగముఁ గావించితిఁ గాఁబోలు. మీ కేమి కావలయును ?

అ—నీవు...ఇప్పటికిఁ బుష్పములు ఫలములు దెమ్ము. (సుభద్ర నిష్క్రమించును.)

సీ. మఱుఁగునఁదిరుగుచోఁ♦ దెలివయం దెలనాదు, పెక్కువమనసుర్షు♦భుక్తమనును
ఎదురరు దెంచుచో♦ నిందుముఖామృత, సరసి దృష్టి మునింగి♦ మరలి రాదు

1 మీకై వసపఱిచిరి=స్వాధీనము చేసిరి. పాణిపట్టనిచ్చిరి (2) మిక్కిలి-చేయి.

పయ్యెర సోఁకునఁ ♦ బయ్యెద కంపింప, సుడియుచుఁ జిత్తంబు ♦ సుళ్లఁ బెట్టఁ
గ్రమ్మతి మేను చోఁ♦గబరినిలంబముల్, ఘన మోహతాపముల్ ♦ ఘనము లగును
ఆ. ఏమి చేయువాఁడ ♦ నెట్టులు సైరింతు, జపము బూమె కైనఁ ♦ జలువు పెట్టు?
లీరహస్యరక్ష ♦ యెవ్విధి? దీనికి మందు గలదె కలికి♦పొందు దక్క? 23

అయ్యో! ఈశాపబాధ లేకున్న నిప్పుడ యీతలోదరిని గాంధర్వవివాహంబునఁ గీయఁగొల్పియుండనా?

(సుభద్ర పుష్పఫలాదులఁ దెచ్చి యిచ్చును.)

సుభద్ర—స్వాములవారికి నగ్నిహోత్రము గావలయునా?

అర్జు—(స్వ.)

తే. ధూమపుంజీభవత్కచ♦స్తోమ మొనరి, జ్వాలికాయితనవ్యలా♦వణ్య మెసఁగ
దాపు చేరిన శీతమై♦దవ్వుపోయి, బాల! నను గ్రాఁగు వౌకవింత♦వహ్నివగుచు?

సుందరీ! నాడెందంబు నీయందె వేల్చుచున్నవాఁడ. ఇఁక వే అగ్నిహోత్రమేల.

సుభద్ర—(స్వ) స్వాములవారెప్పుడు ధ్యానైకతత్పరులే (ప్ర.) స్వామీ! అగ్నిహోత్రము కావలయునా?

అర్జు—కావలసినదే (సుభద్ర యగ్నిహోత్రముఁ దెచ్చి యిచ్చును. అర్జునుఁడు పూజ నభినయించుచు.)

(రుక్మిణీ సత్యభామలు ప్రవేశింతురు.)

సత్య—(అర్జునుఁజూచి) శుభకాలము. ప్రసాద మనుగ్రహింపుఁడు.

అర్జు—నారాయణ. (అని తాంబూలము టెంకాయ పూవు లిచ్చును.)

సత్య—సుభద్రా! ఫలదానము వారే చేయవలయునా? నీవు నీయరాదా?

సుభద్ర—నేను నిచ్చెదను. (అని నారికేళ తాంబూలాదుల నిచ్చును.)

రు—సత్యా! మనము వచ్చినకార్యముముగిసినది. వారిసెలవుఁ దీసికొనిపోదము రమ్ము.

సత్య—నిజమే మన మిచటనుండి వారియేకాంతముఁ జెఱిపినఁ గోపింతురు. స్వామీ! మాకు సెలవా? ఈచిన్నది మీసేవకు యోగ్యురాలే కదా?

అ—(చిఱునవ్వు లోన నణంచికొనుచు) నారాయణ. (రుక్మిణీ సత్యభామలు నిష్క్రి.)

(స్వ) ఈబాలిక మార్దవ్యము మిక్కిలి హృద్యమై యున్నది.

తే. సహజముగ్ధావబిజ్ఞత ♦ శ్లాఘ్యతరము, తళుకుబెళుకులవగలాఁడి♦కులుకు కంటె
బాలికల లొక్కుపలుక్కులే♦బాళిఁగూర్చు, జ్ఞానమానిప్రగల్భభా♦షణము కంటె.

(ప్ర) కాంతామణీ! నేను మధ్యాహ్నస్నానమునకై పోయెద. నీవనిఁ జూచుకొని రమ్ము. (ఇరువురు నిష్క్రమింతురు.)

---

చతుర్థాంకము – ద్వితీయరంగము.

(ద్వారక – సుభద్రామందిరము. సుభద్రాశారదలు సంభాషించుచుందురు.)

సు—నీప్రశ్నమునకుఁ బదపడి ప్రత్యుత్తరముఁ జెప్పెదఁ గాని కొందఱముఖములు నూతనముగఁ జూచినంతనే ప్రీతియుఁ గొందఱముఖములఁ జూచిన నప్రీతియు, నిట్లు వివిధభావము లుప్పతిల్లును గదా దానికిఁ గారణము?

శారద—సౌందర్యము.

సు—సౌందర్యము ప్రధానకారణ మేని సుందరు లందఱు సమానప్రీతిపాత్రములుగ నుండవలయు. లోకంబున నట్లు లున్నదా? సౌందర్యహీను లందఱు ద్వేషింపఁ బడు చున్నారా? వారియందును మైత్రి దాంపత్యము వర్తిల్లుచుండుట లేదా?

శారద—సమానగుణులు ప్రీతిపాత్రములు. విరుద్ధగుణు లప్రీతిపాత్రములు.

సు—గుణాగుణజ్ఞానము సహవాసానంతరముగదా గలుగును? ప్రథమదర్శనముననే కలుగునభిప్రాయముల కేమి హేతువు? విరుద్ధగుణులును మిత్రులుగా నున్నారుగదా.

శారద— దైవమే.

సు—త్రోవకు వచ్చితివి. దైవము నిష్కారణముగ మైత్రివైషమ్యములఁ గలిగించునా?

శారద—దైవమునందు స్వచ్ఛందవర్తనము పక్షపాతబుద్ధి యెట్లు చెప్పుదును?

సు—చం. తరణిమహానుభావతను ♦ దామర యేమి యెఱింగి విచ్చెడిన్
సరగునఁ గాంచినంతఁ? గలు♦వం బెది గాంచె శశిన్ ముకుంగఁగన్?
గరఁగెడిఁ జంద్రుఁ జూచి శశి♦కాంత మదేటికి! నెట్లు చూచినన్
బరగెడి రాగవైరములు ♦ ప్రాగ్భవకర్మఫలోదయంబునన్. ౭౬

యథార్థ మారసినచో విద్యాధనకామవైరాగ్యాదుల నభిలాష కిదే కారణము. కావున నాయనురాగమున కీకారణము తప్ప మఱి యేదియుఁ జెప్పజాల.

శారద—అనుమానమునకో?

సుభద్ర—పాణులు చాపాద్యాయుధకిణాంకితములు. అంగుళులు, హస్తములు, కర్ణములు, గ్రీవ, భూషణకిణాంకితములు. బాహు లాజానువులు. పాణిపాదములు పద్మాది చిహ్నితములు.

శారద—నీవు కారణ మడుగలేదా ?

సుభద్ర—అడిగితిని. ద్రోణాచార్యశిష్యుఁడ నని, చాపవిద్యాప్రవీణుఁడ నని, కొంత కాలము భోగభాగ్యసంపన్నుఁడ నై యుంటినని, చెప్పెను.

శారద—కులమున ?

సుభద్ర—ద్విజుఁడఁట.

శారద—సందిగ్ధమే అనుమాన మున్నప్పు డేల యచటికిఁ బోయెదవు ?

సు—అదియే వచ్చియుండుకష్టము. ఎంత నిబ్బరించుకొన్నను, నక్కడకుఁ బోక, యాయనను జూడక, నేనై పలుకరింపక, యుండఁజాల కున్నాను. ఇనుపతునక సూదంటురాయికై యెగసిచనున ట్లున్నది నావ్యాపారము.

శారద—నీమోహ మంతయు విజయరాజుగారిపై నంటెనే? ఇది శీలహానికరా?

సు—శీలహాని ప్రాణహానియే సుమ్మీ. అంతటిదుర్బలమానసను గాను. ఇట్టు లగుటకుఁ గారణ మేమో తెలియ కున్నాను. అనుమానమే యనురాగము న కుప బలముగనున్నది. దుర్యోధనచింతావిషమునకు నీయమృతము దొరకియుండఁబట్టి బ్రతికితిని.

శారద—ఈయన ద్రోణాచార్యశిష్యుఁ డేని యర్జునరాజుగారి నెఱింగియుండవలయు. ఆవిషయ మడిగితివా ?

సుభద్ర—లేదు.

శారద—అడుగుదము రమ్మీ. (ఇటు నటుఁ బరిక్రమించి) వారే యతీశ్వరు లూరక కూర్చున్నారు.

(శారదా సుభద్రలు సమీపింతురు.)

సుభద్ర—(ఒకయోర నిలుచుండి) యతీశ్వరా! అనుష్ఠాన మైనదా? ఏదైనఁ గావలసి యున్నదా ?

అర్జు—నీవు...సమక్షమున సర్వకార్యములు తీర్ప నాకేమికొఱఁత ?

సుభద్ర—(తల వంచుకొని నేలఁ గాలివ్రేల వ్రాయుచుండును.)

అర్జు—బాలికా ! యేదియో యడుగ నుద్దేశించినట్లు తోఁచెదవు. ఏమది ?

శారద—స్వాములవారికి ధ్యానభంగము గాదేని......

అ—(స్వ) ఉపాసితదేవత ప్రత్యక్షం బై నిలిచి పలుకరింప నన్యంబు ధ్యానించువాఁ డెట్టివాఁడు? (ప్ర.)। నాధ్యానభంగ మీచెలివలననా ? అవశ్య మడుగవచ్చును.

శారద—అక్కా! యడుగుము. స్వాములవారు సదా నీయెడఁ బ్రసన్నులు సుమీ?

సుభద్ర—స్వాములవా రేయేక్షేత్రముల వీక్షించితిరి? ఏతీర్థంబుల నాడితిరి? మీకు మెచ్చుడుక్షేత్ర[1] మేది? ఇవి వినఁ గోరిక.

అర్జు—(చిఱునవ్వున) దీనికా యింత సంకోచించితివి?

కాశీ గంగాసరయూసంగమాదులు దర్శించితి. భక్తగత్యా పరాయణుబదరీ నారాయణు సేవించితి. ధనుష్కోటి దర్భశయనాదుల వసించితి. శేషాచలమున వేంకటాచలపతి, నేక శిలానగరధాము శ్రీకోదండరాము, దేహళీపురీశ్వరు వేంకటేశ్వరు, భజించితి.

ఉ. కాంచితిఁ గుంతలంబు, మణికర్ణికఁ జూచితిఁ, జక్రవాపి సే
వించితి, గంధమాదనము వీక్షణ సల్పితిఁ, గూర్మమూర్తి నీ
క్షించితిఁ, జంద్రపుష్కరిణి సేతువు వింధ్యహిమాచలంబులన్
గాంచిని బుష్కరంబుఁ బొడఁగంటిని గన్యకుమారిఁ జేరితిన్.[2] ౨౨

ఇంతయేల? మోక్షస్థానంబుల నెల్లఁ గంటిఁ గాని యీకడపటిక్షేత్రమువలె నేదియు నామంబున కింపు నిడదయ్యె.

శా—స్వాములవారు చాలశ్రమించినారు. మీకు లేఁబ్రాయంపువారుగా నున్నారే యిన్నిదేశము లొంటిగాఁ దిరిగితిరా? తోడెవ్వరైనఁ గలరా?

అర్జు—నేను విజయుఁడను రాజకుమారుఁడు.

సుభద్ర—విజయుఁడను రాజకుమారుఁడా? కౌంతేయుఁడా?

అర్జు—అవును. కుంతీదేవిగారి తృతీయపుత్రుఁడు.

శారద—అట్లైన వారిని మీకుఁ జక్కఁగఁ దెలియునా?

అర్జు—మిమ్ము మీకుఁ దెలియునా? యనుము.

శారద—ఆయనకు మీకు నంతటి స్నేహమునకుఁ గారణము?

అర్జు—బాల్యప్రభృతి యేకగ్రీవముగనుండుటయే కావున నభేదప్రతిపత్తి.

సుభద్ర—వారు కుశలులా?

అర్జు—ఆఁ. ఇప్పటికి జీవితుఁడే.

సు—(తత్తఱపాటుతో) అదేమి యట్టు లనెదరు? వ్యాధిపీడితులు గారు గదా?

అర్జు—వ్యాధిపీడితుఁడో యాధిపీడితుఁడో?

చం. నిలిచినచోటనే నిలుచు నివ్వెఱపాటును గాంచుఁ, జిత్తమున్
జలిపెడుకార్యమం దునుపఁజాలఁడు, చూచెడు వెఱ్ఱిచూపులన్

---

1 క్షేత్రము=(1)భార్య (2) మడి (3) దివ్యప్రదేశము 2. కుంతలము=వెండ్రుకలు 2 కుంతలదేశము, ఇట్లే తక్కినవి తెలుపఁబడినవి.

గళవళమందు నిండుఁ గని ♦ కంపిలుఁ గమ్మనిగాలి సోఁకినన్
గలికిరో! నిస్తురం గుఱువుఁ ♦ గానఁ డదేమి మనోభవార్తియో. ౭౫

కం. తెను వెల్లఁ బలుకఁబాఱెను, ఘనములు నిశ్వాసములును ♦ గలవరిపాటుల్
తెనువు కృశించె నిఁకే మని, ఘనవేణీ! వినుతు నిలిచెఁ ♦ గాయం బోకఁడే.

సు—హరిహరీ! ఎంతకుర్దినము! (అని వెలవెలఁబోయి పరితాప మభినయించును.)
శారద—స్వామీ! మనోభవార్తి యంటిరే మన్మథార్తియా? అధిబాధయా?
సుభద్ర—(స్వ) అనుగఁ దగినప్రశ్న మే యడుగఁబడెను.
అర్జు—చెప్పదఁ గాని యీబాలిక యిట్లు లడుటకుఁ గారణ మేమి?
సుభద్ర—(స్వ) అడిగినది చెప్పఁడే. నావిచార మేల?
శారద—అప్రియవార్త వినుట.
అర్జు—ఏమియప్రియము?
శారద—ఈమె కాయన మేనత్తకొడుకు, మనోహరుఁడు ఈసంతాప మనకొనఁ గూడదు. అనుభవింపను గూడదు?

అర్జు—(సుభద్రతో) అవునా సుందరీ?
సుభద్ర—(తలవంచుకొనును.)
అర్జు—చెప్ప నిష్టము లేకున్నఁ బోనిమ్ము.
శారద—సిగ్గు.
అ—కామకామం. తనపెద్దవారితోఁ జెప్పుదునో యని సందేహము. ఒకరిరహస్య మింకొకరితోఁ జెప్పుటకా నేను వచ్చితిని? (సు. తలయెత్తి క్రేఁగంటఁ జూచును) నేను బూనినకార్యము నెవ్వరుఁ దప్పింప నేరరు కావున నీమనస్సు నిష్కల్మషముగఁ దెలిపినచో నాచే నైనంత నీకు మేలు చేయుదును గీడుచేయను.

శా—అక్కా! స్వాములవారు నీ కభయహస్త మిచ్చిరి. వారికిఁ బ్రత్యుత్తర మిమ్ము.
సుభద్ర—అవు నని నీవే చెప్పరాదా?
అర్జు—లోకమున మతిసౌందర్యముల కేకాశ్రయత్వము దుర్లభము. వరించి వరించి యర్జునునా వరించితివి?

శారద—అదే మట్టు లనెదరు?
అర్జు—శంకించి శుక్లపక్షమున విదియచంద్రువలె నున్నాఁడు.[1]

1 ఇది యుత్తరోత్తరాభివృద్ధిని సూచించును.

సుభద్ర—విదియచంద్రుఁడు కువలయామోహకారి కాఁడా?

అర్జు—కాషాయవస్త్రము, కమండలువు, జడలు, ధరించి భిక్షావేషంబున నున్న వాఁడు. నీవు చూచియుండిన మోహించియుండవు.

సుభద్ర—అది మీ రెట్లూహించితిరి!

అర్జు—స్త్రీస్వభావమునుబట్టి.

సీ. పట్టుఁబుట్టము జరీ♦పరిధానమునుగాక, కాషాయవస్త్ర మే♦కన్నె మెచ్చుఁ?
బైఁడిచెంబులు వెండి♦పళ్లెరంబులుగాక, యాకమండలువు నే♦యింతి గోరు?
మంజులకాంచన♦మణిహారములు గాక, రుద్రాక్ష పేరు లే♦సుదతి వలచుఁ?
కమ్మవాసన లీను♦గంధసారమె గాక, బూడిదెపూఁత లే♦పొలఁతి కింపు?

తే. కమ్మనూనియపూఁతలఁ♦గాంతు లీను
నునుఁగురుల్ గాక జడల నే♦వనిత కితవు?
దినము భవతి భిక్షాందేహి ♦ యనుచుఁ దిరుగు
బోఁడి వలచున రాచపూఁ♦బోఁడి చెపుమ? ౭౯

స్త్రీలుభోగభాగ్యాసక్తలు కదా? మఱి యెవ్వరి నైన నైశ్వర్యవంతు వరింపుము.

సుభద్ర—యతీశ్వరా! మీరు సెలవిచ్చినది యుత్తమస్త్రీలక్షణము గాదు.

చం. వలచినదానఁ గాను నర♦వర్యు జగాసరిగంచుచేలముల్
చెలువపువాహనంబులును ♦ శ్రీయును రాజ్యము భోగభాగ్యముల్
లలితపురూపముం మెయివి♦లాసము, గావున నిప్పు డన్నియుం
దొలఁగె నటంచు నామదికి ♦ దుఃఖ మొకింతయు లేదు నమ్ముఁడీ. ౮౦

ఆయన తీర్థయాత్ర వెడలుట వింటిని. అట్టివార లిట్టివేషంబు వహించియుందు రనియు నెఱుఁగుదు. సత్యసంరక్షణమునకై భోగంబుల విడిచె నని నేను వ్యసనపడుట లేదు. నామనోహరుఁ డిట్టిసత్యవాక్యైకవ్రతుఁ డని పొంగుచున్నాను. ఐశ్వర్యమును విడిచిన విడువనిండు.

కం. ఎయ్యది లోకము మెచ్చునో, యెయ్యది వేల్పులును మెత్తు♦రిలపై స్థిరమై
యెయ్యది యశముం గూరుచు, నయ్యది విడనాడెనా య♦థార్థముచెపుఁడా?

అర్జు—మాట లెన్నైనఁ జెప్పవచ్చును. ఈనావేషంబు నీకుఁ బ్రీతికరంబా? నిజము చెప్పుము.

సు—ధర్మరాజానుజు నర్జును వరించునన్నుఁ గూర్చి నిజముఁ జెప్పు మనుట వ్యర్థ భాషణము. నామనోహరుచే ధరింపఁబడుట నీవేషంబు సర్వథా సంతోషకరిం బని ముమ్మాటికి వచించెద.

సీ. ఘటసంభవునిజటాఘటలికి మెచ్చెనే, రమ్యలోపాముద్ర ♦ రాజవదన ?
చ్యవనునిపలితకేశములు మోహించెనే,శర్యాతికన్యక ♦ సాధుచరితి ?
చేనున్నవీణకై ♦ మానస మిచ్చెనే,నారదునకు సుకుమారి మున్ను ?
మొల నున్నపులితోలు ♦ మోహించి కూడెనే, ధారుణీధరవర♦తనయగౌరి ?

తే. వారి లెల్లరు నావంటి♦వారు గారొ !
పుట్టరో రాచకూతులై ♦ పొలుపు గనరొ ?
సుఖము తెలియఁగరొ ? భోగించు♦వొప్పు లేదొ ?
ప్రాణపతులుగఁ గొనరె సన్న్యాసివరుల ? ౮౩

వారందఱు వివేకవిహీనలా ? తమప్రియులమహిమ తెలియంగనివారా ?

అ—వారిపతులు తపోబలసంపన్నులగు మహాత్ములు. అఘటనఘటనా చాతుర్ధుర్యులు నీప్రియుఁడు రాజర్షియుఁ గాఁడే ?

సు—నిష్కల్మషం బగువలపునకు వలపె సాధనము. ముఖ్యకారణము. వలపే ఫలమును. తక్కినఫలకారణంబులు గౌణంబులు. మనోవాక్కర్మంబుల దానం బెవ్విధంబుగ నొనర్చిన నది యపరిహార్యంబు అందు మనంబు ముఖ్యంబు. క్షత్రియకన్య నగుటఁ బతివరణంబున నేను స్వతంత్ర. స్వదత్తయైనను గురుదత్తయైనను బ్రథమప్రతి గృహీతకంటె నన్యు మనంబున నేని మోహబుద్ధిఁ దలంచుట శీలవతికిఁ దగదు. సావిత్రియే ప్రమాణము

శారద—చూచితిరి గదా యీమెకు నర్జునునిపైఁ గలమోహాతిశయము ?

సు—(శా-తో) నీప్రశ్నమునకు స్వాములవారు ప్రత్యుత్తరమును దరువాత నిచ్చెద మనిరే !

శారద—స్వాములవారికి దయవచ్చిన......

అ—ధర్మరాజుగారి పట్టాభిషేక మహోత్సవమునకుఁ బూర్వరాత్రమున విజయసౌధ మున కెదుటిమేడమీఁద రాచకన్నియ లందఱు గుమిగూడి వసంతోత్సవ మాచ రించిరఁట.

సుభద్ర—అవును.

అర్జు—అందొకకన్య యాయనచిత్తంబు ముచ్చిలించె నఁట.

సుభద్ర—ఆభాగ్యవతి యెవ్వతెయో?

అ—ఆకన్యక తెల్లపట్టుఁబుట్టముఁ గట్టి, బంగారుటొడ్డాణముఁ బెట్టి, కుసుంబవన్నె రైక తొడిగి, వజ్రాలకమ్మలు ధరించి, మెఱుపుఁదీఁగవలె నుండె నఁట.

సుభద్ర—ఇట్టిదుష్టి స్త్రీలకు సహజము. ఆయనకు...

అర్జు—మోహాబలము.

శారద—(అప) అక్కా! నీవేకదా యానాఁ డట్టిసొగసు చేసికొనినది?

సు—(అప) నీవు చెప్పునది బాగున్నదే.? నే నట్టిసొగసు చేసికొనినది నిజమే గాని మఱియెవ్వరట్లుసింగారించుకో లేదనుట యేమి నిశ్చయము?

అ—ఆకన్యకయే మఱునాఁ డుత్సవమువేళ సారథిగ నుండుతన్నుఁ దామరతోఁ గొట్టి మీఁదఁ బూలు ఱువ్వె నఁట,

శారద—(అప) అక్కా! నీవే కదా యిటు... ..

సుభద్ర—(అప) నే నాయనను గొట్టితినటే? నీవు దగినదానవే!

శా—(అ) కొట్టితి వని కా దక్కా! నే ననినది. మొదటఁ దామరవైచినది, తరువాత బూలు వైచినది నీవే కదా?

సు—(అప)నాదృష్టిపథమున రథముండువఱకు మఱెవ్వరటు చేయలేదు, ఆపట్టనంబున నెన్నియో వీథులు. ఎచ్చట నేమి జరగెనో (ప్ర) ఈస్వల్పవిషయ మాయనస్మృతి యందుఁ గలదుఁగా?

అర్జు—స్వల్పవిషయమా? దానిఁ దలఁచి

కం. అకటా! విషజనితము లగు,ప్రకటానంగాంబకముల • బాలిక నన్నుఁ
వికలాత్మునిఁ జేసెఁగదే, యకళంకుని; నెంతయదయు •రాలో తలఁపఁన్.

అని తపించుచున్నవాఁడు.

సుభద్ర—అదయురాలు గాదు. పుణ్యురాలు.

అర్జు—దేవపూజవేళను గూడ నీధ్యానంబు మఱుచువాఁడు కాఁడు.

శారద—(అ) అక్కా! స్వాములవారు నీధ్యాన మను చున్నారే.

సు—(అ) పోవే యాశాపాతకురాలా! (ప్ర) స్వామీ! దేవపూజకు విరహతాపమున కెక్కుడిపొందిక.

అ—చం. నిరతము నీపయిన్ మనసు ♦ నిల్పి యనల్పతరాంతరంగిక
స్ఫురదురురక్తిభక్తిఁ బలు ♦ పోకలు పోయెడివాఁడ; విష్ణుసో
దరి! కరుణాకటాక్షములు ♦ దార్కొన వేగ ననుగ్రహింపుమీ
స్థిరతరసౌఖ్యదాత్రి వయి ♦ దేవి! తలంపుము నన్ దయాళువుగన్. ౮౪

అని ధ్యానించువాఁడు.

శారద—(అప) విష్ణుసోదరి యఁట.

సుభద్ర—(అప) అవునే. గాక.

శారద—(అప) నీవు గావా?

సు—(అప) రిత్తయాశ లనుజాలు గట్టి నీవు నన్ను సంశయసముద్రంబునఁ ద్రోయుము. వాస్తవావస్థకన్న సంశయావస్థ దుస్సహము సుమా? (ప్ర.) ఆభాగ్యవతి యెవ్వతెయో?

అర్జు—నీవు కాకున్న?

సుభద్ర—ఏనను గాకున్నను నాకు ధనంజయు[1] సాంగత్యము తప్పదు.

అర్జు—జరిగిన వృత్తాంతము చెప్పెద వినుము.

సీ. సంకల్పవీథిని ♦ జలజాక్షినిన్ నిల్పి, కనులారఁ నీక్షించి ♦ గాంచుఁ గాంచుఁ
గాంచి సౌందర్యంబు ♦ కన్నులఁ గట్టిన, మదనాస్త్రవహ్నుల ♦ మఱుఁగు మఱుఁగు
మఱఁగి యెప్పుడొక దే, మానినీ! నినుఁగూడి, యుల్లంబుఁ దెలుపనం ♦ దుకుకునుడుకు
నుడికి మూర్ఛలు కదే ♦ పడఁతి నీవారలు, తలఁపరు మే లంచుఁ ♦ దలరుఁ దలరుఁ

తే. దలరి యన్యంబు నేదియుఁ ♦ దలఁపుగానఁడు
మదనశరతాపమునఁ జేసి ♦ నిదురపోఁడు
పోయెబో యంతలోన భ ♦ ద్రా! యటంచు
నులికిపడి లేచు మదిలోనఁ ♦ గళవళించు ౮౫

శారద—అక్కా! అక్కా!

సుభద్ర—(స్వ) బ్రతికితిని.

అర్జు—భద్రనీపేరా?

శారద—ఈమెబంధువు లంద ఱాపేరనే యీమెను బిలుతురు.

అ—మీయన్న యభిప్రాయమెఱింగినయర్జునుఁడునీయభిప్రాయమెఱింగియుండిన... ఆహా! (అని తలయూఁచును).

---

1 ధనంజయుఁడుఽ(1) అగ్ని (2) కుంతీపుత్రుఁడు.

సుభద్ర—"ఎఱింగి యుండిన" ననెదరే వారెఱుఁగరా? ఎఱింగియుండిన?

అ—నీనిమిత్తమై రైవతమునకు వచ్చినవాఁడు ప్రత్యక్షముగ నిచటికి వచ్చి నిను గ్రహింపక పోవునా?

సుభద్ర—నాకై రైవతముదాఁక వచ్చినవారు మరల నెచటికిఁ బోయిరి?

అర్జు—మఱుఁగుపడి...నీ వొకయుత్తర మైన వ్రాసియుండరాదా?

సు—ఆసాహసముఁ జేసితిని. నే నిచ్చినయుత్తరి మాయన లభింపలే దని మరలఁ దేఁబడినది.

శారద—ఇదే యాపత్రము.

అ—(సు-తో) ఏమి వ్రాసితివి? (శా-తో) ఇటు దెమ్ము (పత్రికఁ జదువును.)

కం. శ్రీవిజయాకర్షార్థము, భావంబున భక్తి మ్రొక్కి • పంచాయుధునిన్
శ్రీవిలసిత భద్రార్థిని, వేవిధములఁ బ్రాణదయితు • విజ్ఞాపించున్. ౮౬

ఉ. వింటి భవత్సుశీలతను • వింటిఁ ద్వదీయసుధర్మరక్తియున్
వింటి భవద్దయాగుణము • వీరవరేణ్యులు జ్ఞానవృద్ధులున్
గంటుగలట్టివారలును • గాదన కాత్మల నిన్ను మెచ్చఁగల్
కంటికి జెప్పలేదు నవ•కంజశరా! యలనాఁటనుండియున్. ౮౭

చం. కలితసురూపమాన్యకుల•క్రమగుణాన్వితరాజకన్యకల్
వలపును నీపయిన్ నిలిపి • వంమరువా రని వింటి, వారి నా
నలఘుమనోబలంబులు గు•ణాగుణతత్త్వవిచారశీల? నా
బలితపుసద్వ్రతంబులను • వ్యర్థ మొనర్చునో యంచుఁ గుందెదన్. ౮౮

సీ. అమ్మతి నందునా•యాత్మనోయనఘాత్మ, రాచకన్నెల కది•క్రమము గాదు
దానంబు నిత్తునా•మానస మందునా, క్షత్రియునకుఁ బ్రతి•గ్రహము దగునె?
హరియింపఁ గానన్ను•నరుదెమ్మటందునా, యానతియా యని•యాగ్రహింతొ
నీదాన నంచును • నే విన్నవింతునా, శ్రోత్తయిచ్చక మను•కొనెద వేమొ

తే. బాలికను నేను నీ వనఁ • బ్రౌఢమతి విఁ, కేమిచెప్పిన నేర మం•దేమిరొంతొ?
కన్యకా రత్నమను నీవు•క్షత్రియుఁడవు, రత్నహారులు పార్థివుల్ • రాజచంద్ర?

సీ. కలశపయోరాశి•కలితయా నవసుధ, రక్కసుండు గ్రహింప • రాకమున్న
అమలమంత్రపవిత్ర•హైయంగవీనంబు, గ్రామసింహము దాఁక • రాకమున్న

తోలకరిమేఘుంబు ♦ చిలకరించెడిధార, పడటునఁ బుట్టిలోఁ♦బడకమున్న
సద్యప్సముత్ఫుల్ల ♦ హృద్య యౌసరసిని, గొసరంబు గలంపఁ ♦ గనకమున్న
తే. విబుధవర్య! ధనంజయా ♦ విమలశుక్తి, పద్మలా! రాజహంస! నా♦హైనికాంక్ష
మానద! గ్రహింపఁ గొని జగ♦న్మాన్యఁజేయు, నమలకీర్తితచరితవే♦గముగ రమ్మ.
తే సుఖద యోశౌర్యవర్ధన జనా♦ స్తుతిద్రయాఢ్య
రమణ కంజాక్ష పితృజిత్ ♦ రమ్యగాత్ర
ప్రోవు శశివంశ్య యాచింతు ♦ రుచిరనయన
వ్యగ్రిమతిజాతినుతుఁడవు ♦ వదలిదీన, రెంటి జంకును గొంకును♦గృపను గనుము.

శుభమద్రి
ద్వితీయ.

అ—మరణాతురునకమృతమువలె నావిరహాతురునకిది జీవనౌషధమై యుండుఁగదా?
సుభద్ర—పురుషులు ధైర్యశాలులు. వారితాప మెంత?
అ—ఆయన వేదనా ప్రవాహవేగముఁజూచి యనుభవించిననాకుఁ దెలియును. నీకేమి తెలియును?
సుభద్ర—అవును నాదుఃఖసాగర మాయన యెఱుఁగనట్లే.
అర్జు—నీకై యాయన యనుభవించు నవస్థల నేనేమి చెప్పుదును?
సుభద్ర—ప్రియువార్త వినినమైన బ్రదికెద. దయగలదేని వచింపుఁడు.
అర్జు—అయిన వినుము.

శా. వ్యాపారంబుల నెల్ల మాని యెపుడుం ♦ ధ్యానాద్యమచింతారతిన్
నీపైఁ గూరిమిపేర్మిచేఁ గలలయం♦దేనిన్ నినుం గాంచుచున్
దాపం బందుచు నున్నవాఁడు మదనా♦స్త్రజ్వాలలన్

సుభద్ర—నేను మాఁడిపోవుచున్న దాననే.
అర్జు— నీవునన్

వ్యాపాదింపక నన్ను నేలఁగదవే ♦ బాలా! మనోహారిణీ! ౬౨

సుభద్ర—నేనా వ్యాపాదించుదానను? నాయవస్థ నే నేమని చెప్పికొందును.
అర్జు—చం. అలివరో! నీముఖాబ్జ మమృ♦తాంశునిబింబమునందుఁ బూర్ణమై
ప్రతిఫలియింపఁ గాంచుటను ♦ బ్రాణము నిల్చెను మేన; నీసదా

గతి దయకల్మి నీచలువ కమ్మని యూర్పులగాలిఁ గ్రోలుటన్
క్షితి నడయాడుశక్తి గలిగెన్, ననుఁ బ్రోవు మరాళకుంతలా ! ౯౩

సు—అయ్యో ? పరదుఃఖానభిజ్ఞుఁడా ! నాఁడా చలువయూఁగుపు ? మీచరణంబుల స్పృశించెదను. దేహ మెట్లు క్రాఁగుచున్నదో చూడుఁడు నాస్థితి మీమనస్సున కైనఁ దెలిసియుండినఁ జాలును. (అని పాదము లంటఁ బోవును.)

అర్జు—(హస్తములు పట్టుకొని) వలదు వలదు (స్వ) ఏమిః దేహతాపము!

తే. వలపుటగ్గి రగుల్ మరుకొలిమియేమొ ?
సానఁ దీసిన కుసుమాస్త్రశస్త్రమేమొ ?
వేఁడి మిడిమెండ సెగఁగొన్న తూఁడొ యేమొ ?
వాడగాలికిఁ గమరినపల్లవంబొ ? ౯౪

సుభద్ర—(స్వ) ఆశ్చర్యము ! కరస్పర్శను తాపోపశాంతి సూచించెను.

అ—(ప్రకాశము) బాలికా ! నీయవస్థఁ గనులారఁ జూచియు నీకుఁ బ్రీతిఁ గలిగింప నేరని యీనిర్దయాత్మునిఁ, బాపాత్ముని నేల యంటెదవు ? వినుము.

కం. వినఁగానమి నీవార్తయుఁ, గనఁగానమి నీసురూపుఁ గన్నారఁగ, ని
న్నన నేటికిఁ దేరకు నే, మన నేటికి నీవు మెచ్చ మానెద నుసులున్. ౯౫

(అని వ్రాలఁ బోవును)

సు—ఆఁ ఆఁ వలదు. నే జీవించియుండఁగనా ? నానిమిత్తమా ? (అని చేయి యడ్డము సాఁచును.)

అ—బాలా ! నీప్రియునవస్థ నే ననుకరించితి. ఇంతమాత్రముననే దేహవిస్మృతి గను దానవు నీవప్పటివాస్తవదశఁ జూచిన నేమయి యుందువో ?

సు—మన్మథబాణంబులు కోమలప్రసూనంబు లయ్యు విరహులపట్ల దారుణంబు లగు నట్లు మీ వాక్యంబులు సుధారసధారలయ్యు నాప్రాణంబుల వెలార్చుచున్నవి.

మాలతి—(ప్రవే.) అక్కా ! దుర్యోధనాదులు రేప మనయూరిపడమటిగవని యొద్ద నుండుతోఁపులో విడిసెదరఁట. ఉదయమున వారి నెదుర్కొన మనవా రందఱుఁ బోవుదురఁట. రుక్మిణీదేవిగారు దీనిని నీకుఁ దెలుపు మనిరి. (సుభద్ర మూర్ఛిల్లి పడును. శారద యుపచరించును.)

అ—ఇంకను స్మృతి రాలేదు. శారదా ! కారణము ?

శారద—ఉఱుము వినినయుంచకన్నె యేమగును ?

అ—(స్వ) కాదు కాదు ఈకఠినాత్ముఁడు. (శారద యుపచరించును. సుభద్ర లేచును.)

(ప్ర.) తన్వీ ! ఏమది ?

సుభద్ర—పురాకృతకర్మఫలానుభవారంభము.

(తెరలో.)

చం. పొరి మునిముచ్చుభంగిఁ గను ♦ మూయుచు విచ్చుచు రాజకీరముల్
శిర మరవాల్చి మెల్లఁ దనుఁ ♦ జేరినవారిని బొంచి చూచె, దు
ర్భర మగు కాఁకలం బకుము ♦ రాళిని దామరపాకుగోడ్డుచేఁ
బరుగులు దేర్చువారు ముగు ♦ దా ! చనుదెమ్ము కవిశ్రమింపఁగన్. ౯౬

మ. తనసామ్మెదియు దాఁచినట్లు సకి ! మ ♦ త్తంబౌద్విరేఫంబు చ
య్యనఁ దావచ్చి సరోజినిన్ మధురసం ♦ బానంగ నుఁకించి కాఁ
కను బల్ క్రాఁగిన తేనె మూలి నునుపం ♦ గాఁ జుఱ్ఱనన్ సోలుచున్
దనుఁ దత్ప్రాంతపురాజహంసము నగం ♦ దారెం ద్రపాసంగలిన్. ౯౭

సు—శారదా ! మధ్యాహ్న మయ్యెను. నాదుఃఖముచే స్వాములవారి నియమమునకు విఘ్న మాపాదింపరాదు. వారికి మధ్యాహ్నస్నానాదులకు సమయము పోదము రమ్ము. స్వామీ ? సెలవిచ్చెదరా ?

అ—నారాయణ మరల నెప్పుడు వచ్చెదవు ?

సు—(మెల్లగ) ఉసు ఉండిన సాయాహ్నవేళకు (శా. సు. నిష్క్ర.)

అ—దరిద్రుఁడు చేచిక్కిన నిక్షేపంబు నైనఁ దక్కించుకొన నేరఁడు. నా మోహ మెట్లు లాఁపుదు ? నా మోహ మెట్టు లైన నగుంగాక. ఆకోమలాంగి జీవించునో జీవింపదో ? "ఉసు ఉండిన" ననియెనే.

తే. బహువిధదుఃఖభరంబున ♦ బాలగాసిఁ, దాళఁజాలక ప్రాణముల్ ♦ దలఁగు నేమొ?
విజ్ఞురాలట్లుచేయుంగ ♦ వేగపడునె? దుఃఖకోపంబులం దేమి ♦ తోఁపఁగలదు,
బాలిక నన నేల ?

చం. పెనువడగండ్లవానకును ♦ బెంపు దొలంగి కలంగి సొంపువోఁ
బొనుపడియున్న పంకజము ♦ పోలిక దాసికతోరవార్తకున్

వనజదళాక్షి మోము వసి ♦ వాడెను, దాని స్మరించినంత నా
మనము దవాగ్ని సోఁకినసు ♦ మంబువిధంబున వాడి మాఁడెడున్. ౯౯

దైవమా! నన్నిచటి కేల తెచ్చితివి? ఏమిచేయ వచ్చును? స్నానాది మధ్యాహ్న కృత్యములఁ దీర్చి యోజించెదఁ గాక. (నిష్క్రమించును.)

---

## చతుర్థాంకము - తృతీయరంగము.

(సుభద్రామందిరము. చింతాయుక్తసుభద్ర శారదభుజముపైఁ జేయి వైచియుండును.)

సుభ—శారదా! ఇఁక నాగతి యేమి?

ఉ. పోఁడిమి నానిమిత్తమయి ♦ ప్రాజ్ఞకృపం జనుదెంచి నట్టినా
ప్రాణము, జీవితేశ్వరుఁడు ♦ ప్రాణవిభుండు, మనోహరుండు, నే
రాణ నొనర్చినట్టివ్రత ♦ రాజఫలంబు, నవీనమల్లికా
బాణుఁడు రైవతాద్రికిని ♦ వచ్చియుఁ గ్రమ్మఱె నెంత మోసమో? ౧౦౦

అయ్యో! ఎంతనిర్భాగ్యురాలనే?

ఉ. ఊహయొనర్ప కే నిచట ♦ నుండి తపించెడికంటె, నాపయిన్
మోహము దూరముం జలిపి ♦ మూఢునికై వడిఁ బోయె? నీతనూ
దాహము దీఱు టెట్లు? స్మర ♦ తాడిత నే మను టెట్లు? దైవమా!
స్నేహము నమ్మిపోయె, నెటు ♦ సేయుదుఁ జెప్పఁగదే తలోదరీ! ౧౦౧

దుర్యోధనుఁడును రేప వచ్చునఁట.

ఉ. మానసభాషణక్రియల ♦ మానసమే కడుముఖ్య మంచు ర
ద్దానిఁ బ్రమాణముం గొని పృ ♦ థాతనుజాతున కీశరీరమున్
దానముఁ జేసి వెండి పరుఁ ♦ దార్యుఁడనఁ జేయుట యెట్లు? విప్రుకై
దాన మొనర్చి గోవును బ ♦ దంపడి బోయకు నీయఁ జెల్లునే? ౧౦౨

కట్టా! నాప్రాణేశ్వరదర్శనలాభం బైన నీజన్మంబున నాకుఁ గలుగదు కాఁబోలు! హా హృదయేశ్వరా! హృదయేశ్వరా! నాకిఁక మరణమే శరణము (అని పాన్పుపైఁ గూలఁబడును.)

శారద—అక్కా! ఊఱడిల్లుము.

సుభద్ర—ఏది తలంచుకొని?

శారద—ఓర్పుఁ దెచ్చుకొనుము.
సుభద్ర—దేనిఁ జూచి?

ఉ. చాలును జాలుఁ బల్కకుము ♦ శారద! నీయుపదేశవాక్యముల్
పోలుప భిన్నకుంభజల♦ముల్ సుమి, నాయెద నిల్వ నేర్చునే
బాలిక! మద్గతవ్యసన♦భార మెఱుంగఁగ నేర్తె? యాదిమ
వ్యాళిభరంబుఁ దుట్టపురు ♦ వాత్మ నెఱుంగఁగ నేర్చునే చెలీ? ౧౦౩

కావడిబరువు చూచువారికిఁ దెలియునటే? సమానదుఃఖులు సుమా సమాశ్వసింప నర్హులు.

శా—అక్కా! నీవు చెప్పినది సత్యమే కాని దుఃఖమును నేకార్యము గాఁగలదు?
సుభద్ర—సర్వదుఃఖపరిహారకము మృతి.
శారద—బలవంతపుమృతి నరకకారణము.
సు—అయ్యో! యివి యెక్కడినీతులే? అట్లయిన నీరాత్రి నీయూర నుండ నొల్ల.
శారద—త్రోవలో దొంగ లడ్డగించిన?
సుభద్ర—సొమ్ము లన్నియు నిచ్చటనే పాఱవైచి పోయెదను.
శా—సౌందర్యము నేనుచేసి పోయెదవు? ధనము చోరులమాత్రము పెరరేఁచును.

వనితాసౌందర్య మెట్టివానిని దుష్కార్య మొనర్పఁ బ్రేరించును,
సుభద్ర—చెలీ! నన్నుఁ బాపిబ్రహ్మ రూపవతిగ నేలచేసెనే? (అని కూలఁబడును.)
శారద—నీరమణునిసంప్రీతికి.
సు—సర్వథా నన్ను నాశము సేయుట కినుము. తలవెంట్రుకలంత బలఁగ ముండియుఁ దలకుఁ బోయుదిక్కు లేదు. తుదకు నాసహజస్వరూపమే నాకు శత్రు వాయె.
శా—ఇంకను నొకదిన మున్నదిగదా గడువు! ఈలోపల భగవత్సంకల్పంబున నన్ని వింతలు పుట్టరాదు!
సు—వింతలా విపరీతములా? పువ్వుపుట్టఁగానే పరిమళించును. కానిపనికే కష్ట మెక్కువ.
శారద—కష్టార్జితమే కడురుచ్యము. నే నొకటి యడిగెదఁ జెప్పుము.
సుభద్ర—అడుగుము.
శా—స్వాములవారియందలి నీ సందేహము నివర్తించెనా?

సుభద్ర—లేదు.

శారద—సందేహముతోడ నేకార్యమునకైన నెట్లు సాహసించెదవు?

సుభద్ర—నిజమే. ఏమి చేయు మనెదవు?

శారద—స్వాములవారి వాక్యములు కొన్ని బోధపడలేదు. నీవు చెప్పెదవా ?

సుభద్ర—ఏవి ?

శారద—నీమనోహరుఁడు రైవతమున కేల వచ్చెను?

సుభద్ర—నాకొఱకై యని చెప్పిరి.

శా—వచ్చినవా రెచటికిఁ బోయిరి ?

సుభద్ర—మఱుఁగుపడి.

శారద—ఎచ్చటికిఁ బోయిరి ?

సుభద్ర—ఏమో.

శా—బాల్యప్రభృతి యేకగ్రీవముగ నభేదప్రతిపత్తి నన్నవారికే తెలియదఁటగా మఱుఁగుపడఁ గారణము ?

సుభద్ర—ఏమో.

శారద—అది పోనిమ్ము. ఇచ్చటికి రామికి హేతువు ?

సుభద్ర—చెప్పిరి గదా మాయన్నగారి యభిప్రాయ మెఱిఁగి యని.

శా—అంతకు మున్నె విరహవేదనయం దది యొకవిషయముగ వాకొనఁబడియెఁ గదా? తెలిసియుండియు రైవతమున కేల వచ్చిరి ?

సు—ఏమో పోవే. అవి యన్నియు నే నిప్పు డాలోచింపఁ జాల. తెలిసియుండిన నీవే చెప్పుము.

శా—విఘ్నహేతకామమే పరితాపకారణము. విజయరాజేంద్రుఁడు నిన్ను వలచుట సత్యము. మీయన్నగారి యభిప్రాయ మెఱుంగుటయు నిజము. నిన్నెట్లైన సాధింప రైవతమునకు వచ్చి యతివేషంబున మఱుఁగుపడి యుండవచ్చును. యతి విధేయు లగుయాదవులచేఁ గొనితేఁబడినవారు వారో యేమో.

సుభద్ర—శారదా ! మంచివిశారదవు. ఆశచేత నన్ను జీవింపఁజేసెదవా ?

శారద—నీ కిప్పుడు విజయకాలము. నీవు నిబ్బరంబుగఁ బ్రవర్తింపవలయు.

సు—విజయకాలమో ? విలయకాలమో ?

శారద—దీనిని జూచి యది నీవే నిర్ధారింపుము.(అని యొకపటముఁ జూపును.)

సుభద్ర—సన్న్యాసులవారిపట మేల వ్రాసితివే?

శారద—ఈయన సన్న్యాసి యని నీ కెట్లు తెలియునే?

సుభద్ర—నీవివేఁము విపరీతపుఁబాకమునఁ బడినదే? వేషముఁజూచినఁ దెలియదా?

శారద—వేషమే లోకమును మోసగించునది. యథార్థజ్ఞానము గాదు.

సుభద్ర—యథార్థ మెట్లు తెలియును?

శారద—వేషముఁ దొలఁగించిన.

సుభద్ర—ఏదీ తొలఁగింపుము

శారద—ఇంకముఁ గాషాయవస్త్రములు, జడలు లోనగునవి యారోపితములు. నీవే వానిని దీసివేయుము.

సుభద్ర—(అవి యన్నియుఁ దీసి యచ్చెరువున) ఏమిది శారదా! యిది నేను వ్రాసిన చిత్తరువుపటము కదా?

శారద—కా దని యెవ రనిరి?

సుభద్ర—(ఆలోచించి) తెలిసెఁదెలిసె శారదా! నీపుణ్యమున బ్రతికితిని. ఉత్కంఠ కంఠగత మగుచున్నది.

శారద—ఇఁకనేమి? మనోహరా! యని దీనిని గౌఁగిలించుకొనుము.

సుభద్ర—అదేమే యట్టు లనెదవు?

శారద—ఇది పట మనుట మఱచితివి.

సుభద్ర—ఔను. వారిగుట్టు......ఇంతటితో నే మైనట్టు?

శారద—అనుమానము బలపడినట్లు.

సుభద్ర—సత్య మెఱుఁగు టెట్లు?

శారద—అది నీవంతు.

సుభద్ర—సిగ్గు భయము పీడించుచున్నవే.

శారద—ఇప్పటిసిగ్గు వెనుకటి కెగ్గు. భయపడకుము. మరలఁ బోదము రమ్ము. మాటల ధోరణిఁ దత్త్వ మెఱుంగ నగు. నేను తోడుగ నుండెద.

సుభద్ర—అట్లైనఁ బోదము పద. (నిష్క్రమింతురు.)

## చతుర్థాంకము—చతుర్థరంగము.

---

(అర్జునులతాకుటీరము. సుభద్రాశారద లర్జును డాయఁ బోవుదురు.)

అర్జు—(స్వ)

తే. పూర్వపుణ్యంబు లన్నియుఁ ♦ బొందుగూడె
సురల కెల్లను నామీఁదఁ ♦ గరుణ వెలసె
వ్రతము లుత్తమతపములు ♦ ఫలము నీనెఁ
గంజలోచన మరల నేఁ ♦ గాంచుకతన. ౧౦౪

ఏలాకో శాలిక సమస్తాభరణంబులు తీసివైచినది.

తే. సొమ్ము లన్నియుఁ దీసియు ♦ సుందరాంగి
పొలిచె నునుఁగ్రొత్తయపరంజి ♦ బొమ్మవోలె
మారుకాఁకను వేఁగుట ♦ మగువమేను
కాఁకఁ దీరిన కనకశ ♦ లాక యయ్యె. ౧౦౫

తే. కొమరుగాలికిఁ జెదరుముం ♦ గురులతోడ
లలన కుఱుమాపుజిలుఁగుఁ ♦ జేలము ధరించి
కొదమతేంట్లల్ల నగయుచు ♦ గునిసి చూడ
నాఁచు పలుచగఁ గప్పిన ♦ నళినిఁ బోలె. ౧౦౬

సు—అక్కా? మనమువచ్చినవేళ మంగళకరము, స్వాములవా రూరకకూర్చున్నారు.

సు—మంగళాంతమును మంగళ మన వలయు.(సుభద్రాశారదలర్జునను సమీపింతురు.)

అర్జు—ఏమిసుందరీ! నీముఖకాంతి మాఱినది. నీయాకారముఁ జూచిన నాయట్టివానికిని మనస్సు నీ రగు చున్నది.

శారద—పెనుగాలికి సుడివడినకదళి యెట్లుండును? స్వాములవారిచరణము లొండె మరణం బొండె శరణం బని యిట కరుదెంచెను.

అర్జు—మరణమా హాహా! నేను జీవించియుండ? ఏమైన విశేషవార్తలు తెలియ వచ్చెనా?

మాలతి (ప్రవేశించి సుభద్రతో) "స్వాములవారిసేవకు నీవిఁకఁ బోఁబనిలేదు. నిన్ను శ్వేతభవనంబుననుంతురు." అని మీవదినెగారు మీతోఁ జెప్పుమనిరి (నిష్క్రమి)

సు—హా ప్రాణేశ్వరా! (అని మూర్ఛిల్లపడును.) ఆఁ ఆఁ (అని యర్జునుఁడు హస్త మాధార మిడును.)

అ—ఏ మిది శారదా!

శారద—సర్వము మీకు విదితము. మీపాలఁబడిన మాయక్కగారి నెట్లు రక్షించెదరో? మీరు కనికరింపకున్న బ్రదుకుటే దుర్లభము.

అ—నీవు వేగముగఁ బోయి పన్నీరముఁ గొని రమ్ము. (శా నిష్క్రమించి పొంచి చూచుచుండును.)

ఎంతటికష్టకాలము! రహస్యము వెల్లడింతునా? స్మృతిహీనయే. ప్రేయసీ!

చం. అదయుఁడు నన్నుఁబోలె లలి ♦ తాంగిరో నిన్నును బ్రాణసంశయా
స్పదగతిఁ ద్రోచెఁగా? యది స్వ ♦ భావము వానికి; దూఱనేల? దు
ర్మదుఁడను, యోజనారహిత ♦ మానసుఁడం, గుటిలాత్ముఁడన్, ననున్
మదవతి! దూఱ నో, నదయ ♦ మానసుఁడం, బరదుఃఖమూఁకఁగన్. ౧౦౭

నీస్థితి నానిబ్బరము! ఓ రా నారాతిగుండియా! మనోహారిణీ!

కం. అపరాధిని నీయెడలన్, విపరీతపువర్తనమున ♦ వెంగలి నయి నే
నపలాపించితి బాలా! కృపచేఁ గనువిచ్చి చూడు ♦ కినియకు నాపై, ౧౦౮

నాకైతవంబు నెవరు సహింతురు? ఈకష్టదశకు నేనే నిదానము.

కం. వంచకుఁడు వీఁడు వీనిం, గాంచఁగ రా దనియొ దవ్వ ♦ గావించి దయన్
ఱుంచినకోపంబున నను, ముంచుచు వ్యథ నేత్రయుగళి ♦ ముకుళించి తరో

చం. కనుఁగవ నీవు మోడ్చిన జ ♦ గం బఖిలంబును నాకు శూన్యమై
తనరెను, నీహృదంబుజము ♦ తత్తఱిలం గని నాదుగుండియల్
చనె శకలంబులై, చెలువ ♦ శ్వాసము సన్నగిలంగ నాయసుల్
తనువుఁ దొలంగి పోయెడిని ♦ దన్విరో! నే నెటు సైఁతుఁ జెల్వమా? ౧౧౦

సదయహృదయువు. నాపరితాపముఁ జూచియైనఁ గటాక్షింపరాదా? సురలారా? మీకు నమస్కరించెద. నామనోహారిణి రక్షింపుఁడు. ఇలువేల్పులారా! మీకు మ్రొక్కెదను. నా ప్రాణదయితఁ బ్రాణయుతఁ జేయుఁడు. (అని విసర) భయము లేదు. నా ప్రాణములు మరల వచ్చుచున్నవి. మూర్ఛ దేఱిన వెంటనే...

సుభద్ర—(లేచి) శారదా! శారదా! (అని పోఁబోవును.)

అర్జు—శారద వచ్చును. నిలుము. నీ కొక మేలువార్తఁ జెప్పెద. నేనే ( తెరలో "శారదా ! శారదా !" అనుధ్వని వినఁబడును.)

సు—అదిగో మాలతి వచ్చుచున్నది. నిలువరాదు. శారదా! శారదా! (అని వెలికిఁ బోవును.)

శారద—(ప్రవేశించి) ఏమక్కా !

సుభద్ర—(ఇంచుక కోపము నటించుచు) ఏమక్కా ! ఒంటిగ విడిచి యెం దేగితివే?

శారద—నీకుఁ దాపశాంతిఁ గావింప.

సుభద్ర—తాపశాంతి యీచెట్టుచాటున నున్నదా ?

శా—నీవు మూర్ఛిల్లితివి. అట్టిదశయం దనురాగము గలవారిచేష్టలు వాక్కు లెట్లుండునో కనుద మని డాఁగితి.

సుభద్ర—(కుతుకములో) ఎట్లుండెనే?

మాలతి—(ప్రవేశించి) అక్కగారింటికి రేవతీదేవిగారు, రుక్మిణీదేవిగారు, సత్యాదేవిగారు వచ్చి మిమ్ము వెంటనే తోడుకొని రమ్మనిరి.

సుభద్ర—రేవతీదేవిగారా ?

మాలతి—అవును. బలరామరాజుగారి దేవిగారు.

సుభద్ర—(నిట్టూర్చి) ఏమంతతొందరపని ?

మాలతి—వా రందఱు రాత్రియంతయు నింద వేడుకగా మీతోడ నుండువా రఁట.

సుభద్ర—ఏల?

మా—ఉదయమునకుఁ బూర్వమే మీకు నభ్యంగనము నలంకారముఁ గావింపవలయు నఁట. వారు వాకిట నిలిచి యెదురుచూచుచున్నారు.

సు—(స్వ) అనురాగముగలవారివాక్కు లిట్టి వని విన నైన వలనుపడ దేమో ? ఏమి కష్టకాలము! ఇఁక వారిముఖదర్శన ప్రాప్తియు లేదు గాఁబోలు. దైవమా ! (సు. శా. మా. లు నిష్క్రమి.)

అర్జు—(నివ్వెఱపాటున నిలిచి.)

ఉ. ఎంతటి మోస మయ్యె నిఁక ♦ నేమి యొనర్పఁగ నేర్తు? మన్మథా
క్రాంతహృదంతరుండ నయి ♦ కార్యము నూహ యొనర్ప లేక వి
భ్రాంతి నతుల్యరూప నను♦రాగవతిం బెడఁబాయఁ జూచితిఁ
గంతునిబారికిం బడితిఁ ♦ గాయము నిల్పుట యెట్లో వేదనన్. ౧౧౧

ఉ. జీవితసంశయాంధ్యమునఁ జేడ్పడ నేను మెఱుంగుఁబోణి తా
వావిరి చంచలాలతికఁ భంగిగ నయ్యె, నిఁ కేమి చేయుదున్ ?
దైవమ ! కైవసంపడిన తామరసాక్షిని జాఱవిడిచితిన్
ద్రావఁగలేక పాలను ధరాస్థలిఁ ద్రోసెడి పిల్లి పోలికన్. ౧౧౨

తే. సంధ్య జాతెను గన్నియ చందమునను
దలఁగె రక్తి సుభద్ర చిత్తమునఁ బోలి
తమము ముంచెను నను మోహాతమము మాడ్కి
జక్కవ యొకండె యింక నాసాటి జగతి. ౧౧౩

ఇఁక నా ప్రియురాలిఁ జూచుభాగ్య మైన లేదేమో? ఇం కెక్కడి ప్రియురాలు? కాలువాతనో యాకూశిచేతనో పడును. ఎంతటవిచారిహీనురాలు. నిలిచి మాటాడక యైనఁ బోయెను. ఏమి మాటలాడును ? నేనా నిజస్థితిఁ జెలుపనైతి. నావంచన మెఱుంగు నంతటినేర్పరియా యాబాలిక ? ఇది స్వయంకృతాపరాధము. అనుభవింపవలసినదే. ఎటనుభవింతును.? కార్యము చక్కఁబఱుమార్గము లేదా ? పునర్దర్శనమే లేదఁట యిఁక మార్గ మేమున్నది ? ఇన్నిదినము లాదరించినవారి తుదకు నొకమాటఁజెప్పి సెలవు తీసికొని యైన రమ్మనరా ? ఒకవేళఁ బోయిరమ్మనిన నెవరెవరు వెంట వత్తురో ? ఏమియుపాయము ? (అని యాలోచించువానివలె నిటునటుఁ బరిక్రమించి) ఇఁక నేయుపాయము పనిలేదు. ఈసారి గోచరించెనా... యేమైనఁ గానిమ్ము విడుచుట లేదు. గోచరింపక యే పోయిన ?... ఈవిచారమున సంధ్యవేళ మించుచున్నది. కర్తవ్య మావల యోజించెదఁగాక. (నిష్క్రమించును )

---

చతుర్థాంకము - పంచమరంగము.

(సుభద్రామందిరము. రేవతీరుక్మిణీ సత్యభామాసుభద్ర లాసీనలై సంభాషించుచుండ శారద నిలఁబడి యుండును.)

స—ఈమాటల కేమిగాని సుభద్రా! స్వాములవారియొద్ద సెలవు కొని వచ్చితివా ?

సు—(స్వ) ఈనెపముననైన మరలఁ దదీయదర్శనము లభించునేమో (ప్ర) లేదు.

రుక్మిణి—అవిషయమున సుభద్రయే స్వతంత్రురాలా ?

సత్య—కాకున్న ? ఆయనగతి యాయన దని యూరకుండ వలసినదే ?

రేవ—సుభద్రనే పోయి చెప్పుట నీతిగాదు. చెప్పకయే యుండుట మర్యాదగాదు.

స—నీతులు మర్యాద లటుండ నిండు. చెప్పక పోయిన మీమఱఁదిగారు చెప్పియుండి నంత యగును మాబావగారిని యతీశ్వరులవారు కోపింతురో శపింతురో.

రేవ—మీబావగారి నేల కోపింతురు?

సత్య—వారే కదా వారి కాంతరంగికశిష్యులు.

సుభద్ర—(స్వ) దైవమా! చెడితిని. మోసపోయితిని. అన్నగారిపన్నాగము మున్నే తెలియనైతి

సత్య—వారిచే వా రుపదేశమునుగూడఁ బొందిరే?

రేవ—ఏమియుపదేశము?

స—మీరు వినలేదు కాఁబోలు. రైవతకాద్రి కందఱుఁ బోయినపుడు మాబావగారు మీమఱఁదిగారు యతీశ్వరులవారిని సందర్శించిరఁట. అప్పుడు బావగారు వారి శక్తిసామర్థ్యపాండిత్యాదుల కచ్చెరువుపడి స్వామీ మా కొక భద్రమార్గ ముపదేశింపుఁ డని కోరిరఁట.

రేవ—స్వాములవా రేమి యుపదేశించిరో?

స—మ. సమయార్హం బగునట్టివేషమును, భాషానైపుణంబుం, బరా
క్రమముం, మేధయు, సాహసంబును, గభీరత్వంబు, నామాద్యుపా
యములుం, వెండి సుదృక్సముత్కరమనోజ్ఞాకారముఁ, దైవసా
హ్యము, నోయాదవవర్య! ధైర్యమును, భద్రావాప్తికిం మార్గముల్.

అని యుపదేశించిరఁట. (శారద సుభద్రవంకఁ జూచును.) సూక్ష్మముగ మోక్షమార్గ మడుగఁగగా మనసుభద్రముంచుకొం డని చెప్ప రఁట. (సుభద్రముఖము దెలివొందును)

రేవ—నిశ్చయమే. "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" యని కలదుగదా.

సత్య—అవునవును. మీరు విద్యావతులు గనుకఁ జక్కఁగ గ్రహించితిరి.

రేవ—ఈమాత్రమునకా మీబావగారిని వారు కోపింతు రంటివి.

సత్య—ఇంతకే కాదు వారియందు గురుభక్తి గలిగి చతుర్మాస్యమునకు మన యింటనుండఁ బిలుతమా యని మాబావగారు మీమఱఁదిగారి నడిగిరఁట.

రేవ—మఱఁదిగా రేమనిరి ?

స—అది కష్టకార్యము. గోవుసాధుత్వము యతిశాంతి యనుమాట వినమా ? వారి యిష్టముచొప్పున మనము జరిపింపమేని కోపము వారు పడుచు వెంటనే యిక్కడ నుండక లేచిపోదురు. తరువాత నేమి మూఁడునో ? ఎవ రిప్పుడు వీరికి మనయింటఁ బరిచర్య సేయువా రనిరఁట.

సుభద్ర—(స్వ) చిన్నన్న చక్కనిమార్గ ముపదేశించెను.

రేవ—మీ బావగా రేమిచెప్పిరి ?

స—దుర్వాసునకుఁ గుంతీదేవివలె, నారదునకు సుకుమారివలె, మనసుభద్ర యనిరఁట.

రేవ—నిజమే. తరువాత.

సత్య—మా బావగారు యతీశ్వరులవారిని 'జాతుర్మాస్యమునకు మాపీట నిలిచి మమ్ము ధన్యులఁ జేయవలయు" నని ప్రార్థించి రఁట.

రేవ—యతీశ్వరులవారు కా సిమ్మనిరి కాఁబోలు.

సత్య—అనాలోచితముగ ననలేదు.

రేవ—ఏమి చెప్పిరి ?

స—మీరు రాజులుగదా. రాజు లనఁగ భోగాసక్తులు. మే మనంగ యోగాసక్తులము. మేము నిశ్చితకార్యతత్పరులము తదేక ధ్యాననిష్ఠులము. మీకన్యాభిలాష మెండు. (సుభద్ర స్వగతము. స్పష్టము) మ మ్మనాదరించినచో...

రేవ—మీ బావగా రేమిచెప్పిరో.

సు—(స్వ) ప్రతికూల సందర్భంబున వారి యుద్దిష్టమార్గ మేయదో చెప్పనీయదే.

సత్య—మీకార్యమున కెట్టికొఱఁతి కలుగకుండఁ బ్రవర్తించెద నని బాస చేసిరఁట.

రేవ—మీ బావగారా పట్టినపట్టు వదలువారు ?

సత్య—పట్టుదల లేమి మీమఱఁదిగారిసొత్తు.

రుక్మిణి—సత్యా ! యేమి తెలిసి యీమాట నంటివే ?

స—మీవలె వారి లోగుట్టులు నాకుఁ దెలియవుగాని మన కందఱకుఁ దెలిసిన యొక విషయము దృష్టాంతముఁ జెప్పెద.

రుక్మిణి—ఏదే ?

స—(రేవతితో) సుభద్రను విజయున కిచ్చి వివాహ మొనర్చిన బాగని మీ వరుసనది గారు తొలుతే జెప్పిరి కదా? ఆమాటయందు నిలఁబడిరా ? అక్కా! యిది మీకుఁ గూడఁ దెలియును గదా ?

రేవ—అవును. మాట నిలుకడలేమి కిదియా దృష్టాంతము ?

సుభద్ర—(స్వ) అట్లైనచోఁ జన్నన్న నా కనుకూలపక్షమువాఁడే.

రు—తమ యభిప్రాయముఁ దాము దెలిపిరి, బావగా రంగీకరింపరైరి. కాదు కూడ దని పెద్దవారితోఁ గలహింపు మనెదవా ? ఆమాటలకు వచ్చిన మనయత్తగారి మామగారి యభిప్రాయ మేమి ? మనయిష్టమేమి ? అందఱు మర్జునున కీయ వలయునని చెప్పినవారమే కదా ?

సుభద్ర—(స్వ) వీ రందఱు మనపక్షమువారే.

స—పోనిండమ్మా ! పెద్దవారితో నాకేల వాదు ? కాని యీవివాహము దలఁచు కొనిన నాకొక సంతోషము.

రేవ—ఏమి ?

స—కృతయుగమునాఁటివారు గనుక మీరు, నీకాలమువారిలో నేను, వివాహవిష యమునఁ దల్లిదండ్రులయిష్టప్రకారము వర్తించినవారము. ఇప్పుడు మనము ఱుదలు.

రు—(చిఱునవ్వున) అక్కా ! మనసత్య విశ్వామిత్రుని యవతారమేమో ! గిచ్చి కల హానకుఁ బిలుచును. నేను దన్నా క్షేపించితి నని యిది బడులు. (సత్యతో) నేనును దల్లిదండ్రుల యిష్టమునకు విరోధింపలేదులే. మాయన్నగారి యభిప్రాయమునకే విరోధించితిని, ఎఱిఁగి యెఱిఁగి దురాత్ము నెట్లు పెండ్లిచేసికొనవలయును ?

సుభద్ర—(స్వ) నాస్థితి యట్టిదే. నాగతి యెట్లు కానున్నదో ?

సత్య—అటు లని యన్నగారిని బరిభవింపవలయునా ?

రుక్మిణి. నిజక్షేమనాశకుఁ డన్నగాఁడు దున్న.

సుభద్ర—(స్వ) సత్యము.

రు—శారదా! నీవు మాలతిలోనగువారెల్ల సుభద్ర కభ్యంగనాదు లొనరింపఁబోండు.
(శా - మా - సు - లు నిష్క్రమింతురు.)

(తెరలో) చం. ఇరు లనునీలిచేలము వహించి ప్రతీచికి నేగఁ జొచ్చె రా
తిరి, ప్రియుపత్నినిం గదియఁదేర నినుండును బాహిరంబుగాఁ

ద్వారపడెఁ, జక్రవాకి నిజవల్లభుఁ జేరఁగఁ గోరె, సమ్మదా
కరశుభమంగళధ్వనులకై నదిమించె శకుంతనాదముల్.

రేవ—రుక్మిణీ? యుదయము కావచ్చెను. మీబావగారు ప్రయాణ సన్నాహంబున నుండురు వియ్యంకుల నెదుర్కొనఁబోవలయు. ఉదయపూర్వమే మనలఁబ్రయాణ సన్నాహంబున నుండఁ జెప్పిరి గదా. మనము పోవలదా ?

రుక్మిణి—పోవలసినదే.

సత్య—సుభద్ర నర్జునభవనంబునకుఁ దోడుకొని పోవువా రెవ్వరు ?

రేవ—రుక్మిణీ! సత్య యిప్పటికి నర్జునుఁ గలవరించుచున్నదే ?

సత్య—అర్జునభవన మనిన శ్వేతిభవనము కాదు కాఁబోలు.

రేవ—ఏమి జాణవే సత్యా ! సుభద్రా! (అనిపిలుచును సుభద్ర ప్రవేశించును.)

రేవ రు, స—మే మిట నిఁక నిల్వరాదు పోయివత్తుమా ?

సుభద్ర—(ఊరకుండును. రేవ. రు. స. లు నిష్క్రమింతురు.) శారదా!

శారద—ఏమక్కా ?

సుభద్ర—మాలతి యిందే యున్నదా ?

శారద—లేదు.

సుభద్ర—వింటివా వదినెగార్ల సంభాషణము ?

శారద—నేను విన్నదాని కనుకూలమే. నీప్రాణేశ్వరుఁడే యాయీశ్వరుఁడు. జరుపవలసిన దాలోచింపుము.

సుభద్ర—నీ వరగడియలో సాయుధము సపరికరం బగురథముఁ బన్ని కొనిరమ్ము నీ నేర్పు చూతము.

శారద—సారథి ?

సుభద్ర—వలదు.

శారద-(స్వ) సాహసము. ఎట్లు కానున్నదో. (నిష్క్రమి.)

సు—అవె వాద్య ఘోషములు. అందఱుఁ బయనించుచున్నారు కాఁబోలు. వారికిఁ బడమటిగవను మాకుఁ దూర్పుగవను రథము వచ్చువఱకుఁగాచికొనియుందునా? ఇప్పుడే పోయి నాప్రాణేశ్వరుఁ దోడి తెత్తునా? పోరాదు. ఈలో నెవరైన వచ్చిన? రథము రాఁగనే పరుగునఁ బోయి పాదములఁబడి "ప్రాణేశ్వరా! రథ మూరో

హింపుఁ"డని సవినయసాభిప్రాయసూక్తిఁ దటాలునసమ్మోద విస్మయంబులం గూర్చెద. అప్పుడుగదా నాప్రతిభాసామర్థ్యంబుల వారు మెత్తురు. (ఆలకించుట నభినయించి) మంగళవాద్యము లీవంక వచ్చుచున్నట్లున్నవి ఎవరైన...

శారద—(తొందరగఁ బ్రవేశించి) అక్కా!

సు—శారదా! యెంతశక్తిమంతురాలవే. ఈలోపల నేరథము సిద్ధముచేసి తెచ్చితివా?

శారద—(తత్తరపాటుతో) ఆఁ తెచ్చితిఁ దెచ్చితి

సుభద్ర—ఏమి తెచ్చితివే?

శా—స్వాములవారియొద్ద నీకు సెల విప్పించి శ్వేతభవనంబునకుఁ దోడ్కొనిపోవ మీబలరామన్న లోనగువా రిటకు వచ్చుచున్నవా రనువార్త.

సుభ—హా! చచ్చితి (అని కూలఁబడి వెలవెలఁబోయి) ఇదటే నీవు తెచ్చినది?

శారద—స్వాములవారియొద్దకుఁ బోయి యుందువేమో యని చెప్పవచ్చితి.

సుభద్ర—(దైన్యముతో) ఇఁక నాగతి?

శారద—దైవమే. పదెడుగండిని జిన్నగులకరాయియు నాఁగుట కలదు. నే నొక యుపాయముఁ జేసెద.

సుభద్ర—ఏమిచేసెదవు?

(దేవకీ, రుక్మిణీ. సత్యభామా, వసుదేవ. బలరామ, కృష్ణులు ప్రవేశింతురు.)

బల—సుభద్రా! స్వాములవారియొద్ద సెల విప్పించెద రమ్ము

శారద—స్వాములవారికి నిష్ఠాసమయము. మౌనము వహించి యుందురు.

బల—అవునా సుభద్రా!

సుభద్ర—(తల యూఁచును.)

బల—అయినఁ గొంచెము సేపు కూర్చుండుట బాగు (అందఱుఁ గూర్చుందురు.) (తూర్పుఁజూచి) సూర్యోదయ మైనదే. శారదా! వారినిష్ఠ ముగిసిన దేమో చూచి రమ్ము.

శా—(స్వ) ఆనిష్ఠ మీరు గవనుదాఁటిన ముగియును. దుర్యోధనుఁడు జాముప్రొద్దున కూరివెలుపల విడియు నఁట. ఒకగడియ ముందైన వీ రెల్ల రందుఁ జేరవలయు. దూరమా నాలుగుగడియలకు మించియే యున్నది. ప్రొద్దా యెక్కు చున్నది. ఇంకొకగడియ గడియన్నర రాకపోకల జాగు చేసితినేని బలరామరా జట నుండక పోవును. తరువాతివిచారము తరువాత (నిష్క్రమి)

శారద—(ప్రవే) స్వాములవారిజపము ముగిసినది. అగ్నుల వేల్చుచున్నారు.

బల—ఎంతకాలము పట్టునో.

శారద—ఒకగడియ పట్టును.

బల—(తొందర సూచించుచు) ఒకగడియ పట్టునా?

శారద—పట్టును. (స్వ) నాయోజన వ్యర్థము పోవునట్లు లేదు.

బల—గడియ కావచ్చినది ఏమి చేయుచున్నారో చూచి వేగ రమ్ము,

శా—(శీఘ్రగమన మభినయించుచు నిష్క్రమించును. పిమ్మట మరలఁ బ్రవేశించి) అగ్నుల వేల్పు యయినది. ఏదో పరధ్యానముగ నున్నారు. నారాకపోక లెఱుంగరు. మీరు కాచి యుండుట వారికి నివేదింతునా?

బల—పొమ్ము. నిమిషమున మరలవలయుఁ జుమీ. (శారద. నిష్క్ర.)

శారద—(ప్రవేశించి) అరగడియ తాళి రమ్మనిరి.

బల—ఇంత జాగేల చేసితివి?

శారద—వారు మీరాకకుఁ గారణ మడిగినఁ జెప్పుచుంటిని.

బల—ముచ్చటలతోఁ గాలయాపనము చేసితివి.

శారద—(స్వ) సత్యము బుద్ధిపూర్వకముగనే.

బల—అరగడియ కావచ్చిన నందఱు బయలుదేఱుఁదు (వాక్యములు మ్రోఁగును. అందఱు నిష్క్రమింతురు.)

---

## చతుర్థాంకము - షష్ఠరంగము.

(అర్జునపర్ణశాల. అర్జునుఁ డిటునటుఁ బరిక్రమించుచుండును.)

అ—(స్వ) రాత్రి యంతయు నేఁ జేసినయూహాయందు సుభద్రాపునర్దర్శనముదక్కఁ దక్కినదంతయు వ్యర్థ మయ్యె. చాతకముతృషఁ దీర్ప వచ్చువర్షబిందువును విడ గనుసరించుచున్నది. వారా పలువురు. సాయుధులు. నేనా నిరాయుధుఁడను. ఒకవేళ రణమునకే సాహసించితిఁబో, తటుకున సుభద్రను గొనిపోయి వా రింటేని దాఁచిన యుద్ధమువలని ప్రయోజనము? కలహవార్త తెలిసిన దుర్యోధనాదు లింటేవత్తురు. పాతికూల్య బాహుళ్యము. మ్రొక్కవచ్చిన సుభద్రను వెనుకకుఁ

దిగిచితినిగా. నేను సన్న్యాసి ననియే కదా దానితలంపు. అది యేల నాయిష్టానుసారము వర్తించును. చెడితిని చెడితిని. అన్నివిధములఁ జెడితిని.

(బలరామాదులు ప్రవేశింతురు.)

అందఱు—స్వాములవారికి సాష్టాంగనమస్కృతులు.

అర్జు—నారాయణా. అలంకృతులై యంద ఱిటువచ్చితి రేల ?

బల—వివాహసమయము.

అర్జు—ఎవరికి ?

బల—మీసేవకురాలు సుభద్రకు. మీకు నిది విన్నవించి మీసెలవుఁ గైకొని పోవ వచ్చితిమి.

అర్జు—మాకు మాసుభద్రకు వివాహమనినఁ బరమసంతోషము. నీవు నిశ్చయించిన వరుఁ డెవ్వఁడో ?

బల—కురుకులవర్ధనుఁడు రాజరాజు దుర్యోధనమహారాజుగారు.

అర్జు—ధృతరాష్ట్రుకొడుకు గదా? కురుకులవర్ధనుఁడే.

(సేవకుఁ డొకఁడు ప్రవేశించి యుత్తరము బలరామున కిచ్చును. బలరాముఁడు చదివి కృష్ణున కిచ్చును )

బల—స్వాములవారు నన్ను క్షమింపవలయును. దుర్యోధనమహారాజుగారికి వెలుపల విడిసియున్నారఁట. మే మెవ రెదుర్కొన రామైతి మని యాయాసపడుచున్నారఁట. మాకు ననుజ్ఞ యిచ్చి యనుపవలయు. వీరే మాతల్లిదండ్రులు. కర్తవ్యమంతయు వీ రిట నుండి జరిపింతురు.

అర్జు—బంధుమర్యాద తెలియని ప్రమత్తుఁడవు. ఏల యామహారాజుగారికి వృథాయాసము గలిగించితివి? ఇకనైన సమాధానపఱుపఁ బొమ్ము. జాగు సేయకుము, పొమ్ము. అనుజ్ఞ యిచ్చితి. నీ లేమికి మేము కోపింపము. విచారపడము. పొమ్ము పొమ్ము.

బల—కృష్ణా ! స్వాములవా రెంతలౌకికులు.

కృష్ణు—సందేహ మేమి?

బల—మనజననీజనకులు, రుక్మిణీసత్యాసుభద్ర లిం దుండువారు. తక్కినవా రెల్లఁ బయనింపుఁడు. స్వామీ మా కందఱకు సెలవా?

అర్జు—నారాయణా. (బలరామాదులు నివ్వెఱపడియుందురు. (స్వ) ఎటుచూచినను గా ర్యము చిక్కగనే యున్నది, ఇందు వసుదేవుఁడు పూజ్యుఁడు. తక్కినవారుస్త్రీలు మాననీయులు, ఇపుడు సుభద్రను బలాత్కారముగఁ గొనిపోవుదునా? అటుగాక దేవకీ వసుదేవులపాదములఁ బడి నిజస్థితి నెఱిఁగించి కన్యాదానముఁ జేయఁ గోరుదునా?

సుభద్ర—(స్వ) కర్తవ్య మేదియు స్ఫురింపదు. తల్లిదండ్రుల నెట్లు నిరాకరింతును? స్వాశయమెట్లు వెలిపుత్తును? ప్రియుఁడా యూరకున్నవాఁడే. (అని సాభిలాష ముగ నర్జును వంకఁ జూచును)

దేవకి—సుభద్రా! స్వాములవారికి నమస్కరించి నీ తెచ్చినపదార్థము లర్పింపుము.

సుభద్ర—(స్వ) నమస్కారమునెపమున నామనోహరుపాదములు గట్టిగఁ బట్టు కొనెద తరువాత నెట్లైనఁ గానిమ్ము. (నమస్కరింప ముందరికిఁ బోవును.)

సత్య—(చేయిపట్టి వెనుకకులాగి) స్వాములవారిమీఁదఁ బడెదవాయేమి? ఇప్పుడే యింతస్వాతంత్ర్యమా? దూరముననుండి నమస్కరింపుము.

వసు—(వస్త్రాభరణాదులపళ్లెరమును ముందర నిడి) మాకన్నెయందుఁ జాల నను రాగముగలవా రని వింటిని అది నిక్కమేని యీ వస్త్రాభరణములు తాము ధరించి మ మ్మానందింపఁ జేయవలయు.

అర్జు—(స్వ) నా శాపము మొన్నటితోడనే తీరినది ఈవస్త్రముల ధరించి నిజస్వరూ పముఁ గనఁబఱిచెద. పిమ్మట నేమగునో.

వసు—స్వాములవారు మాప్రార్థన నంగీకరింప నాలోచించుచున్నారు. (సుభద్రను జూచి) నీ వీపుష్పదామకంబు వారికంఠంబున వైచి యీవస్త్రముల గ్రహింపఁ బ్రార్థింపుము.

సుభద్ర—(పుష్పమాలిక మెడవైచి. వస్త్రంబులఁ జేఁ గొని నిలుచును)

రుక్మిణీ—సుభద్రా! నీవూరక నిలిచిన నెట్లు? వస్త్రంబులు గొనఁ జేలుపట్టుకొనివైన వేఁడుకొనుము.

స—వారుగదా సుభద్ర కేలుగ్రహింపవలయు? (అర్జునుఁ డావస్త్రములఁ దీసికొనును)

వసు—సత్యము. (అర్జునుఁ జూచి) అల్లుఁడా! నీతపఃఫలం బీకన్య గ్రహింపుము.

అ-సు-(విస్మయసంభ్రమ సంతోషంబు లభినయింతురు. సుభద్రసిగ్గునఁదలవంచును. అర్జునుఁడు సుభద్రపాణి గ్రహించును.)

స—(సుభద్రతో)మఱఁదలా! స్వాములవారిసేవవలన నీకోరినవిభుఁడు లభించెఁగదా!

దేవకి—ఈ కన్నియ యెట్టివల్లభునిఁ ♦ గాంచు నెనర్చి ప్రతిష్ఠ సౌఖ్యసం
పన్నతఁ గూరు, గౌరవము ♦ బంధుసమూహమునందుఁ గాంచెడిన్
మన్నన దల్లిదండ్రులకు ♦ మానుగఁ గూర్చునొ యట్టికాంత లో
కోన్నతునిన్ వరించి మది ♦ కూరిట గూర్చితి మాకు బాలికా!

వ—అల్లుఁడా! ఆయుధపూర్ణ మైనరథంబు వాకిట సిద్ధముగ నున్నది. సుభద్రాద్వితీయుండవై బాహుబలంబు దోడుగ యథాసుఖంబుగ నింద్రప్రస్థంబునకుం బయనింపుము, పునర్దర్శనంబు శీఘ్రింబుగ నయ్యెడు. పొలిమేరదాఁటి కుశలవార్త నంపుఁడు ఇఁకఁ బయనింపుఁడు జాగు సేయకుఁడు.

అర్జు—(దేవకీవసుదేవులకు మ్రొక్కి) అనుజ్ఞాతుఁడనా?

దే-వ. దీర్ఘాయుష్య మస్తు. పోయిరండు.

సుభద్ర—(దేవకీవసుదేవులకు మ్రొక్కును) దీర్ఘసుమంగలీభవ (అనిదీవింతురు.)

అ—(సుభద్రను జూచి) వదినెగారులకు మ్రొక్కితివా?

రుక్మిణీ-సత్య—మే మింకను జ్ఞప్తియం దున్నారమా. (సు. మ్రొక్కును.)

సత్య—శీఘ్రమే వ సుపుత్రావాప్తి రస్తు.

రుక్మిణీ-సత్య—అన్నా యర్జునా! నీవుమాత్రము మమ్ము మఱవకుము. మామఱఁదలు మఱచునట్లు చూడుము. పునర్దర్శనం బయ్యెడు.

సుభద్ర—(రు. స. లతో) మీతోడ శారదను దప్పక కొని వచ్చెదరా?

రుక్మిణీ-సత్య—అట్టు లగుఁ గాక.

అర్జు—పెద్దలయాజ్ఞ నిర్వహింతుమా?

అందఱు—అవశ్యము. (సుభద్రార్జునులు రథ మెక్కుదురు. సుభద్ర సారథిస్థానంబునఁగూర్చుండి రథంబు దోలును. దేవ-వసు-రు-స-శా-లు నిష్క్రమింతురు)

అర్జు—ఇదో మనము తూర్పుగవనిఁ జేరితిమి భటు లడ్డగింప నున్నారు.

(పురద్వార రక్షక భటులు ప్రవేశింతురు)

ప్రతాపసింహుఁడు—ఓరీ సంగ్రామసింహా! పోయెరా పోయెరా!

సంగ్రామ సింహుఁడు—పోనీయకురా పట్టుకో-పట్టుకో.

విక్రమసింహుఁడు—దేనినిరా సంగ్రామసింహా!

సంగ్రా—వాఁ డెదో పోయెరా యనెను. నేను బట్టుకోరా యంటిని.

ప్రతాప—దొంగరా దొంగరా!

(పృథుశ్రవసుఁడు—పీఁక నూఁదును. భటులందఱు గుంపుచేరి యర్జునురథమున కడ్డము వత్తురు.)

గేయము.

పృథు—ఎవ్వఁడురా నీ విటు లేగ?

అర్జు—ఎవ్వఁడ నైనను నీ కేలా?

పృథు—యాదవి గదరా యీయింతి?

అర్జు—నాదయితర మరుననబంతి.

పృథు—శ్రీకృష్ణునకును జెల్లెలురా.

అర్జు—ఈకొంతేయున కింతియుగా.

పృథు—ముచ్చిలి యేటికిఁ బోయెదురా?

అర్జు—పెచ్చగుభుజబలవీరతరా.

పృథు—విడు విడు బాలను

అర్జు— విడువనురా,

పృథు—పొడిచెదఁ గను మిదె

అర్జు— పోపోరా.

పృథు—పట్టుఁడు పట్టుఁడు భటులారా.

అర్జు—కొట్టెదఁ గొట్టెద గుటిమీఱా.

సుభద్ర—(అర్జునునితో) మీ రనుజ్ఞ యిచ్చెదరేని నేను వీరిని మట్టుపెట్టెద.

అర్జు—నీకు యుద్ధకౌశలమును గలదా?

సుభద్ర—సత్యాదేవి శిష్యురాలను.

అ—కం. కులశీలమాఁకోచితముగ, వెలఁదుక విద్యల గ్రహించి • విభునకుఁ దనకున్
గలిగించు నిహపరంబులు, కులహీనులవిద్య నేర్చి • కొంపం గూల్చున్.

ప్రేయసీ! మనసంతోషకాలంబున నెవ్వారే మననిమిత్తంబుగ దుఃఖింపరాదు. అందు వీరు భటులు. వీరిపై ద్వేష మేల? వీరి నశక్తులఁ జేసెదఁ జూడుము. (అని యొక యస్త్రముఁ బ్రయోగింపఁ దేనెటీఁగలవలె ములుకులు ముసరి భటుల బాధించును.)

భటులు—అబ్బా! యిక్కడఁ గఱచెరా యిక్కడఁ గఱచెరా (అని తల, మొగము భుజము, గొట్టుకొనుచుఁ గ్రిందఁబడి తన్నుకొనుచు) అయ్యా! మహారాజా! పాండుకుమారా! విజయరాజేంద్రా! శరణు శరణు. మమ్ముఁ గావుము. నీ యిష్టము వచ్చినట్లు పొమ్ము.

అర్జు—సైనికులారా! అస్త్ర ముపసంహరించితి. భయపడకుఁడు. మీరు వెంటనెపోయి పశ్చిమద్వారంబు వెలుపల వనములో విడిసియుండు నెల్లరతోఁ బెండ్లికొడుకు విజయుఁడు పెండ్లికూఁతు సుభద్రను గొనిపోయె నని తెలుపుఁడు. ఆనవాలుగ మన్నామాంకిత బాణములఁ జూపుఁడు.

భటులు—బుద్ధి బుద్ధి దేవరా! (అని నిష్క్రా)
సుభద్ర—నాథా! నాకై యెన్నికష్టములు పడితిరి.
అర్జు—కష్టాంతము లిట్టి సుఖారంభము లగునేని ప్రళయంబు నాకుఁ బందువులు.

సుభద్ర—కం. నీకై నామానస మెటు, వీకునఁ బరువెత్తుచుండె వేగయుతంబై
యాకైవడిఁ బఱపెదఁ దే, రీకుశలత నింకఁ జూడుమీ ప్రాణేశా!
(అని రథముఁ దోలును. నిష్క్రా.)





# సుభద్రావిజయము.

## పంచమాంకము.

### విష్కంభము.

(ఇద్దఱు బ్రాహ్మణబాలురు ప్రవేశింతురు.)

కోఅభట్టు—కొండిభట్టా! కొండిభట్టా! ఒకమాట.

కొండిభట్టు—ఏమిమాట కోఅభట్టా!

కోఅ—ఎక్కడికి విసవిసఁ బోవుచున్నావు? వీథులవెంబడి సీగుంపేమి?

కొండి—కూపకూర్మమా! యూరిలోనివార్తలే తెలియఁగవా?

కోఅ—ఏమి-యేమి? రాత్రి పరుండినవాఁడ నిప్పుడ లేచితిని.

కొండి—తూఁగుఁబోతా! పెండ్లికొడుకు దుర్యోధనరాజుఁగా రూరిబయల విడిసియున్నా రని విని నేను బోయితిని.

కోఅ—పప్పుదప్పళాల కాశపడితివా? తరువాత.

కొండి—బలరామరాజుగారు లోనగువారు పెండ్లికొడుకు నెదుర్కొని యూరిలోనికిఁ బిలుచుకొని రాను వచ్చిరి.

కోఅ—వారికి నీ వెదురైతివి కాఁబోలు.

కొండి—వారందఱు నచ్చట సభదీరియుండ మననగరము తూర్పుగవని కావలివారు లబలబ యని మొత్తుకొనుచు వచ్చిరి.

కోఅ—పెండ్లికి మేళములు లే. దండుగుమారి పెండ్లికొడుకు సాపాటురాముని మొగముఁ జూచెనా?

కొండి—ఏలని వా రడుగఁ బెండ్లికొడుకు పెండ్లికూఁతు నెత్తుకొనిపోయె నని చెప్పిరి.

కోఅ—సరి తైనమాట. తరువాత.

కొండి—పెండ్లికూఁతు రెవ్వ రనిన సుభద్ర యని పెండ్లికొడు కర్జునుఁ డని చెప్పిరి.

కోఅ—ఆపెండ్లికొడు కేమిచేసెను?

కొండి—అంద ఱొకరిమొగము నొకరు చూచుచుండఁ గృష్ణుఁ డుపాయముచేసి దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకునుల నర్జునుఁబట్టి తేరఁ బోవఁ బ్రేరించెను.

కో॥అ—మంచియుపాయము. నా మెచ్చు. పెండ్లి యక్కడ నగును.

కొండి—ఆఁడుదానితోనా యుద్ధ మని కర్ణుఁడు పోయె నఁట. తక్కినవుప్పురను సుభద్ర యుద్ధమునబద్ధులఁ జేసి తన సేవకుల వెంట మన రాజుగారియొద్దకుఁ బంపెను.

కో॥అ—అంతవఱకు నాకును దెలియునులే.

కొండి—నిద్దురపోతా! యిది నీకుఁ దెలియునా? ఆయుద్ధములో దుర్యోధను నర్జునుఁ డిట్లు గ్రుద్దె నఁట. (అని యొకగ్రుద్దు గ్రుద్ది పాఱిపోవును. నిష్క్రి.)

కో॥అ—నీపని పట్టించెదఁ బొమ్ము (నిష్క్రమించును.)

---

పంచమాంకము-ప్రథమరంగము.

ద్వారక-సుధర్మసభామందిరము. ఉగ్రసేన, వసుదేవ, బలరామ, కృష్ణ, సాత్యకి, గదులు సభదీరి యుందురు.)

బల—యదురాజేంద్రా! యాదవవీరులారా! ఈదినమున మనమందిరంబున జరగిన యన్యాయము మీకుఁ దెలియును గదా. సింహగుహాభ్యంతరముఁ జొచ్చి సింహకిశోరంబును మేషంబు హరించె. ఇట్టివిపరీతవృత్తము నెన్నఁడైనఁ గంటిరా? మఱి వింటిరా? అర్జునఁడు బోడివాఁడై మనయింటనుండి మనయుప్పుఁదిని తుట్టతుదకు మనలనే మాయమాటల వంచించి మనపోషణమున నున్నపడుచును వివాహము కానున్నదాని నన్యనిశ్చిత సుభద్రను బేలించి బలాత్కరించి ముచ్చిలించి కొని పోయి మనల నవమానపాత్రులఁ జేసెను. దీనిని సహింపవచ్చునా? మనయంతి పురము నందలి చౌర్యమునకే మనము ప్రతీకారముఁ జేయ నొల్లమేని, చేయ నశక్తులమేని, ప్రజలు మనరక్షాశక్తి నెట్లు విశ్వసింతురు? పరరాజు లేమియెంతురు? హాసింతురు గాక. ఈనగరంబున నెవ్వరికిఁ నాభార్య నాధనము నాకుఁ గాతు రని ధైర్యంబున నుండువారు. కావున దుర్జను నర్జును నిర్జించి మనకన్యక మరలఁ గొని రావలయు. వృథావాక్యంబులఁ గాలహరణంబు గారాదు.

ఉగ్ర—సుభద్ర కర్జునుఁడు మేనత్తకొడుకు. మన మైనను బిలిచి పిల్ల నీయఁ దగిన వరుఁడే కదా? అంత్యనిష్ఠురత్వ మేల?

బల—రాజేంద్రా! ఈవివాహవిషయంబున నాయభిప్రాయము వినుఁడు అర్జునునకు సుభద్ర నీయ నొల్లమి ద్వేషబుద్ధిఁ గాదు ఇప్పుడు లోకంబునఁ గలరాజులలోఁ

గౌరవులు యాదవులు ప్రబలులు. ఈయిరువురి పరస్పరస్నేహము లోకక్షేమకరము. అన్యోన్యకలహము జగత్ప్రళయకారణము. దీని యోజించియే మనపెద్దలు కుంతీదేవిని పాండురాజున కొసంగి కౌరవులతోడి నెయ్యంబు సంపాదించిరి. ప్రస్తుతమునఁ గౌరవులు ద్విధావిభక్తులు. ఆ రెండుపక్షములు మనకు సమానములు, ధార్తరాష్ట్రులు పాండవులు పరస్పర విద్వేషంబునఁ బీడింపఁ బడుచున్నవారు వారి కుటుంబకలహములతోడ మనకుఁ బనిలేదు. లోకక్షేమము మన సౌఖ్యము మనకుఁ బ్రధానము. మన మొకరిపక్షముమాత్ర మవలంబించితిమేని బలాధిక బుద్ధిచే మనపక్షము వారే కలహకారు లగుదురు. దాన జగంబునకు ముప్పు తప్పదు. కుంతీసంబంధంబునఁ బాండవులు మనకు బంధువులు. అట్టులే సుభద్రా సంబంధంబున ధార్తరాష్ట్రులును మనకు వసులేని పకులవలన వారికిఁగాని, మనకుఁగాని భయము లేదు. ఆతిరికలహముల నాఁప నగు. ఇరువురకుఁ దుల్యుల మగు మనము తమపక్షము మాత్రమే వహింతు మనుభ్రాంతి యెవరికిఁ గలుగదు. దీనిచే భువనంబునకు శుభం బగు నయ్యది మేలో, గాక పక్షపాతబుద్ధిఁ గలహముఁ బ్రేరేచుట మేలో, మీరే యోజింపుఁడు. అంతియగాక ధార్తరాష్ట్రి సంబంధ మార్యశీలాచార సమున్నతోత్తమక్షత్రియ సంబంధము.

ఉగ్ర——యాదవవీరులారా! మీయభిప్రాయంబులను న్యాయమంద దృష్టి యిడి వచింపుఁడు.

(ద్వారపాలకుఁడు ప్రవేశించును)

ద్వార——దేవా! సుభద్రాదేవిగారిపనుపున నెవ్వరో వచ్చి దర్శనంబుఁ గోరెదరు.

ఉగ్ర——తోడి తెమ్ము. (ద్వారపాలకుఁడు-నిష్క్రమించును.)

బల——అర్జును దుశ్చేష్టితంబుఁ గూర్చియే మనబాలిక వార్తఁ బంపి సాహాయ్యము రాఁగోరెడిఁ జూసుఁడు, భీరువుగానఁ గన్య యెంతభయపడెనో. తనదిక్కులేమి కెంత దుఃఖపడెనో.

(నాగకుమారుఁడు - ప్రవేశించును)

బల——(తొందరతో) నీ వెవ్వఁడవు?

నాగకుమారుఁడు——సుభద్రాదేవిగారి దూతను.

బల——ఏల వచ్చితివి?

నాగకు—పెండ్లికట్నముఁ దెచ్చితిని.

బల—(రోషంబున) పెండ్లికట్నమా? ఇటు దెమ్ము.

(నాగకుమారుఁడు నిష్క్రమించి దుర్యోధనాదులతోఁ బ్రవేశించును)

నాగ—రాజేంద్రా? వీరు సుభద్రాదేవి గారిచే రణవిజితులు. తదాజ్ఞాబద్ధులు. వీరిని మీకొప్పగింప దేవిగారియాజ్ఞ. సుఖముగఁ బొలిమేర దాఁటితి మని మెల్లరకు విన్నవింపు మనిరి.

బల—(శోత్రుపాటుతో) అయ్యో! దుర్యోధనాదులా?

ఉగ్ర—దూతా! వీరిని బంధముక్తులఁ జేయుము.

(నాగకుమారుఁడు దుర్యోధనాదులకట్లు విడుచును.)

బల—దుర్యోధనా!యిటుకూర్చుండుము. దుశ్శాసనాదులారా!మీరటుకూర్చుండుఁడు.

(దుర్యోధనాదులు కూర్చుండుదురు.)

ఉగ్ర—దూతా! యీముగు రెవ్వరు?

నాగకు—వారినే యడుగుఁడు.

ఉగ్ర—ఓబ్రాహ్మణోత్తములారా? మీ రెవరు? నిజముఁ జెప్పుఁడుఁ

లంబోదర సిద్ధాంతి—(తడఁబడుచు దుర్యోధనుముఖముఁ జూచును. దుర్యోధనుఁడు తలవంచుకొనును.)

ఉగ్ర—దిక్కులు చూచెద వేలయ్యా? భయపడితివా? భయపడకుము. ముసలిబ్రాహ్మణుఁడవే నిన్నెవరయ్యా కట్టిరి?

లంబో—మహారాజా! యీపాపజాతి (అని నాగకుమారునిఁ జూపును.)

ఉగ్ర—నిన్నేల కట్టివైచెను?

లంబో—పాగరుచేతనే. మరేమికారణము గలదు?

ఉగ్ర—ఎప్పుడు కట్టెను?

లంబో—ఒకనెల యయినది.

ఉగ్ర—ఈనెలగా నెక్కడ నుంటివి?

లంబో—వీఁడే నన్నుఁ బాతాళమునకుఁదీసికొనిపోయి యొంటిగ నిర్బంధంబుననుంచి చుట్టు పాముల విడిచి, యిదో చంపెద నదో చంపెద నని బెదరించుచు, బాధ పెట్టెను. మహారాజా! యిఁకనైన విడిపింపుఁడు. పోయెద.

ఉగ్ర—ఎక్కడనుండ నిన్నుఁ గట్టెను ?

లంబో—మేము మాయూరికిఁ బోవుచుంటిమి రైవతికాద్రిసమీపమునఁ బోవునపు డొకసన్న్యాసి తేరిపైఁ బ్రయాణించుచుండెను. ఆ తేరిసారథి వీఁడె (అని సుకేతునిఁ జూపును) ఆయనసమ్మతిగొని మేము దానియందుఁ గూర్చుండిపోవుచుండ నది విఱిగిపడెను. దానిలోఁ జిక్కుకొంటిమి వీఁడు వచ్చి కట్టెను.

ఉగ్ర—సన్న్యాసి యేమయ్యెను?

లంబో—రథము విఱిగిపడుట కాయనయే కారణము. మేము పోవుచుండ నారదుఁ డెదురయ్యెను. ఆయనకు నమస్కరింప సన్న్యాసి దుమికెను, ఆవేగమున రథము విఱిగెను.

ఉగ్ర—ఉత్తతేరే కదా? మీరేల లటాలునఁ గ్రింద దుముకరైతిరి?

లంబో—అది యుత్తతేరు కాదు. యంత్రపూరితము. ఈనిర్భాగ్యుఁ డెవరిని జంపుట కో యట్టిది తెచ్చినాఁడు. అది మాప్రాణముమీఁదికి వచ్చినది (అని సుకేతుని జూపును.)

సుకే—(కోపముతో) నాపాలిటికి మృత్యువుగ మీరు వచ్చినది గాక నామీఁద నసత్యముఁ జెప్పెదరా? మీవలె సన్న్యాసిని జంపుటకు నేను రాలేదు.

లంబో—దుష్టుఁడా ! మేమా సన్న్యాసిని జంపువారము బ్రాహ్మణులము ?

సుకే—(ఉగ్రసేనుఁ జూచి) మహారాజా! వీరు దొంగబ్రాహ్మణులు వీరియొద్దఁ గత్తు లున్నవి. పరీక్షింపుఁడు (లంబోదరుఁజూచి) మీ రాసన్న్యాసిని జంపఁ గత్తులు దూయఁగా నేను జూడలే దనుకొంటిరా ?

ఉగ్ర—భటా ! వారియొద్దఁ గత్తు లున్నవేమో పరీక్షింపుము (భటుఁడు పరీక్షింపఁ బోవ)

లంబో—మేము మనుగు. మమ్ముఁదాఁకకుము మేమే యిచ్చెదము. (అని కత్తులుదీసి యిత్తురు.)

ఉగ్ర—బ్రాహ్మణుఁడా ! నిజము చెప్పుము. మీ కీకత్తు లేల?

లంబో—రాజా ! త్రోవలో వంటఁజేసికొనఁ గూరగాయలు తఱుగుటకు. బ్రాహ్మణుకిత్తు లింకెందునకుఁ బనికివచ్చును ? మహారాజా ! యీమోసగాఁడు మాపై నబద్ధములు చెప్పుచున్నాఁడు. ఆసన్న్యాసికి వీఁ డొకయుత్తరముఁ జూపెను, ఆయన తల్లీ యని యేడ్చుచుండ నారథముపై నెక్కించుకొని పోవుచుండెను

తనపని కడ్డము వచ్చినార మని మమ్మప్పుకు తిట్టినాఁడు రాజా! సన్న్యాసి కీతఁడు చూపినయుత్తర మీతనియొద్ద నున్నది. పరీక్షింపుఁడు.

ఉగ్ర—బావిత్రవ్వఁబోయిన భూతములు వెలివచ్చుచున్నవి. భటా! ఈబ్రాహ్మణులను సారథిని గూడఁ బరీక్షింపుము. వీరియొద్ద నింకే వేవి యున్నవో. (భటుఁడు పరీక్షించి బ్రాహ్మణునొద్ద నొకపత్రము, సారథియొద్ద నొకపత్రము వెలుపలఁ దీయును.)

భటు—రాజేంద్రా! యిది బ్రాహ్మణునిపత్రము. ఇది సారథిపత్రము (అనియిచ్చును.)

ఉగ్రసేనుఁడు—(పత్రములఁ జదివి సభ్యుల కిచ్చును. అందఱు సారథిపత్రముఁ జదివి హా! హా! యందురు బ్రాహ్మణునిపత్రముఁ జదివి కోపరక్తనయను లగుదురు.)

ఉగ్ర—ఓరి సారథీ! నీవు దుష్టుఁడవుగఁ దోఁచెదవు. కుంతీదేవిగారు మరణించినట్టు ధర్మరాజుగారు వ్రాసిన యీయుత్తర మెక్కడిది? నిజముఁ జెప్పిన మన్నించెద. చెప్పవేని చిత్రవధకుఁ బాల్పడుదువు.

సుకే—అయ్యా! నేను సారథిని గాను. వేషధారిని. రాక్షసుఁడను. ఈ దుర్యోధన మహారాజుగారు యంత్రపూరితరథముఁ గొనిపొమ్మనియుఁ, గుంతీదేవి మరణించె నని యుధిష్ఠిరుఁడు వ్రాసినట్లు తాను వ్రాసినయీలేఖ (సభ్యులు హా! హా! యందురు) నర్జునునకుఁ జూపి రథంబుపై నెక్కించుకొని వచ్చుచో నతనిఁ దేరియం దటకించి వధింపుమని యంత్రమర్మం బెఱిఁగించి పంపెనుగాని, క్రమ్మఱిపోవునపుడు నాగ్రహచార బలంబున నాస్థానంబున నర్జునుఁ డుండునట్లు లేర్పడెను. వారు బ్రాహ్మణు లని నేను మోసపోయినట్లు నేను సారథి నని వా రెంచిరి కాఁబోలు మాపాలిటఁ దోఁకచుక్కవలె నారదుఁ డెదురయ్యె. అర్జునుఁడు క్రిందికి దుముకునెడ మాకురదృష్టంబున యంత్రమర్మస్థలమంద కే లూఁదెను దాన మే మందఱమం దిటకికొంటిమి. అర్జునుఁడు తప్పించుకొనెను. ఈతఁడు మమ్ముఁ బట్టుకొనిపోయెను. వీఁడుచెప్పిన సన్న్యాసియే యర్జునుఁడు. ఇఁక మన్నించిన మన్నింపుఁడు. చంపినఁ జంపుఁడు.

ఉగ్ర—ఓరి ముసలివాఁడా! నీవు బ్రాహ్మణుఁడవుగావు. రాక్షసుఁడవు. నిజముఁ జెప్పిన మన్నించెద. చెప్పవేని చిత్రవధకుఁ బాల్పఱిచెద.

లంబో—రాజేంద్రా! నేను బ్రాహ్మణుఁడఁ గాను. బ్రాహ్మణవేషధారిని. రాక్షసుఁడను. దుర్యోధనుమిత్రుఁడ. అలంబసుఁ డనువాఁడ. జటాధరశాస్త్రి యనుపేరు గల యీబ్రాహ్మణుఁడు నామిత్రుఁడు. ఖరుఁడనురాక్షసుఁడు. కామరూపులము. ద్రౌపదీవిషయంబునఁ బాండవులసమయంబు విని యర్జును వేర్పఱిచి వధింపనెంచి ద్రౌపదీయుధిష్ఠిరులేకాంతంబునను౦డ నర్జును౦డట కేగునట్లొనర్ప మా తోడ్పాటు నీదుర్యోధనమహారాజుగారు గోరిరి. మేము మ్రుచ్చులమై గోవుల హరించి,యర్జునుఁడు ద్రౌపదీయుధిష్ఠిరు లుండునాయుధాగారంబునకుఁ బోవఁ జేసితిమి. ఆయన మానెన్నంబునఁ దీర్థయాత్రికై నెడలె. రాజాజ్ఞచొప్పున మేము వెంటనంటియతఁడు నిద్రించువేళ నతని గంగలోఁ ద్రోచితిమి. మా వెంట నచ్చిన బాలకుఁడు కమల నాభాచార్యుఁడు మమ్ము బట్టవచ్చెఁ గాని మేము తప్పించుకొని పరువెత్తితిమి. ఈవిషయంబున రాజుగారు మాకు వ్రాసినపత్రిక యతనిచేఁ జిక్కెను. యీవ ద్వృత్తాంతము పైకిఁ బలుప నెచ్చటనైన జీవించి యర్జునుఁడు చరించెడినేమో తీర్థములందు రోయుఁ డని వ్రాసిచ్చిరి. పంచతీర్థంబునకుఁ బోవుచుండఁ గని తెలుప మకరంబులవాతఁ ద్రోయుఁ డనియు, బ్రదికినను సుభద్రాపేక్ష మానుకొన పితాన స్వరూపము నొంద శపింపఁజేయుఁడనియు, నీరాజుగారు విధించిరి. మేము విజయు నీళ్ళఁద్రోచియుఁ జావఁడయ్యె ననియు, దీర్ఘవాసియం దావేశించి శపింపఁ జేసియు ద్వారకి కేగెడి ననియు, పైకిఁ జెప్పితిమి. ద్వారకకుఁ బోనీయ వలదని, మరలింపుఁడని, మాకు వీరుకొన్నియుపములునేర్పిరి. శాపవశంబున సన్న్యాసియై గుర్తింప రాకున్నను, సుభద్రా యని కలవరించుటచే,నర్జును రైవతకాద్రియందుఁ గనుఁ గొంటిమి. ఇంతలో నీపాప సారథ్యరూపముఁ దెచ్చెను. దానిలో మేము ముప్వుర మతికకొంటిమి. మమ్మువ్వరో పట్టుకొనిపోయి నేలకొట్టునఁద్రోసి యిపుడు వెలికిఁదెచ్చిరి. ఇది వాస్తవము. చంపినఁజంపుఁడు. మన్నించిన మన్నింపుఁడు.

ఉగ్ర—జటాధరశాస్త్రీ! లంబోదరసిద్ధాంతి చెప్పినది సత్యమా?

జటా—సర్వము సత్యము.

బల—(స్వ) అర్జుననినా నేను యతీశ్వరుఁ డని కొనివచ్చితిని. ఛీ (ప్ర)సుభద్రామందిరమున నర్జునుపర్ణశాలయందు నీవిషయమైనపత్రిక లేవేని యుండిన రోయింపఁ దగు. రాజేంద్రా! అర్జునుద్రోహంబు హానిచే వెలువడఁగలదు.

ఉగ్ర—అప్పుడుగాక. గదా ! నీవుపోయి వెదకిరమ్ము. (గద-నిష్క్రమించె)భటా!నీ వెవ్వఁడవు?

నాగకు—నే నులూపిదేవిగారి సేవకుఁడను. అర్జును వంచింప నెంచినయీయిర్వురఁ బొంచి యామెగారియాజ్ఞ చే నేను దిరుగుచుంటిని. వీరు త్రైర్థిక వేషంబుల నర్జును వెంటఁబోవ యత్నింపఁ గమలనాభాచార్యుఁడనుపేర నేను గూడఁబోయితి. గంగ యొద్దున వీరితోఁ బోరి వీరియొద్దనున్న పత్రం బొడిచికొని యులూపి దేవిగారికిచ్చి నవాఁడను నేన. నేనే విశారదుఁడనుపేర హితముపదేశించితి. నారద వేషంబున నర్జునున కెదురైనవాఁడను నేన. తేర నితికికొన్నవీరి మారాణిగారి కర్పించిన వాఁడను నేన. ఆమె యానతిచొప్పున నీసారథి వేషంబు వహించి యీదుర్యోధ నునితో నర్జునుఁడు మరణించె నని యభిజ్ఞానంబుగ నాయన వ్రేల నుండు మాయా ముద్రిక నిచ్చినవాఁడను నేన. వీరిని బద్ధులఁజేసిన యస్త్రంబును లూపిదేవిగారి యాజ్ఞ చొప్పున సుభద్రాదేవిగారికిచ్చినవాఁడను నేన. సుభద్రాదేవిగారి యాజ్ఞ ప్రకారము వీరిని మీయొద్దకుఁ దెచ్చినవాఁడను నేన.

ఉగ్ర—త్రాడు తెన్నువారిఁ దలఁదన్నువారు లేకుందురా? చెఱుపకురా చెడెద వను సామెత కలదుగదా ? దుర్యోధనా ! వీరుచెప్పినది యథార్థమా? (దుర్యోధనుఁడు తలవంచికొనియుండును.)

సాత్యకి—వీరిని బంధించిన వారెవరు? విజయుఁడా? సుభద్రయా?

నాగకు—వీరిని బంధింప విజయరాజేంద్రుఁడు కావలయునా! సుభద్రాదేవిగారే.

సాత్య—రాజేంద్రా! మనసుభద్రావిజయంబు జగద్విదితంబుఁ జేయు టొప్పు.

ఉగ్ర—సత్కీర్తిచంద్రికయుఁ, గస్తూరికామోదమును స్వయంవ్యాపకములు.

బల—వీరు చెప్పినకథలతోఁ బనిలేదు. వనల వంచించినందునకు నర్జునుఁడు దండ్యుఁ డా కాఁడా యనుట విచారణీయాంశము. అది విమర్శనీయము.

ఉగ్ర—కృష్ణా ! నీయభిప్రాయ మేమి ?

కృ—(లేచి) రాజేంద్రా! లోకక్షేమాపాదనంబున బలరామన్నగారి యభిప్రాయమే నాయభిప్రాయము. లోకక్షేమకరంబులు సత్యధర్మంబులు. లోకబాధాకరంబు లసత్యాధర్మంబులు. వ్యాధిహరపుష్టికరౌషధంబులనై ద్యుండు దేహంబురక్షించు. లోకరక్షకుం డసత్యాధర్మంబు లణంచు. మఱి సత్యధర్మంబులఁ బెంచు. దాన లోకంబు సురక్షితంబు.

ఉగ్ర—విషయము సత్యము. అయిన నప్రస్తుతము.

కృ——మనము లోకరక్షాతత్పరులము. సత్యధర్మరక్షణంబులు మనకుఁ గృత్యంబులు.

బల——(అసహనము సూచించుచు) కావని యెవ రనిరి? శాఖాచంక్రమణముననఁగాల హరణ మేల? సుభద్రార్జునులు దవ్వేగుదురు.

కృ——సత్యధర్మరక్షకుల మగు మనకుఁ బాండవధార్తరాష్ట్రకుటుంబకలహములోనే కాదు పాండవధార్తరాష్ట్రలనుమూర్తులతోనే పనిలేదు.

ఉగ్ర——ఇనపడుచు మనయింట నడవలసినదే?

కృ—నృపాలా! లోకక్షేమాచరణము కర్తవ్యము. అగునేని బాంధవవిచారము పరిహర్తవ్యము. మనకుఁ బాండవధార్తరాష్ట్రులు సమానులు.

బల—సత్యము.

కృ—లోకు లందఱు మనకు వారియట్టివారే. పుష్పఫలావనాసక్తుఁడు వృక్షంబురక్షించు. సత్యధర్మరక్షాపరుఁడు తదాధారశిష్టులఁ బ్రోచు. పాండవులు సత్యధర్మాశ్రయులు. ధార్తరాష్ట్రు లసత్యాధర్మనిలయులు. పాండవధార్తరాష్ట్రకలహము కేవల కుటుంబకలహముకాదు. సార్వ్యాత్రికలహము. ధర్మాధర్మములకుఁ బోరు. ధర్మ మధర్మముచే బాధితము మఱి వంచితము ధర్మ మప్రతీకారలాలసము. దైవైకశరణము. మనమా సంరక్షణ సమర్థులము. ఇట్టిచో నెద్దికర్తవ్యము.

ఉ "సారపుధర్మముఁ విమలసత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారము నొందలేక చెడఁబాలివి యైనయవస్థ దక్షు లె
వ్వార లుపేక్ష సేసి రది వారలచే టగుఁ గాని ధర్మని
స్తారక మయ్యు సత్యఫలదాయక మయ్యును దైవముండెడున్" ౧౧౯

అనుసూక్తియే ప్రమాణము. పాండవోపేక్ష ధర్మోపేక్ష. అది కృత్యవర్జనము. దుర్యోధనపక్షం బన్యాయపక్షంబు. తదవలంబం బకృత్యకరణంబు కావునఁ బాండవసాహాయ్యాచరణం బవశ్యకారణంబు. అప్రత్యవాయంబు. తద్బాంధవంబునన యది యగు. యాదవసహాయులగు పాండవులకు దుర్యోధనుఁడు వెఱచి మిన్నకున్న నధర్మాభ్యుదయంబు గాకుండు. అది తాత్కాలిక లోకక్షేమకరంబు. మిన్నకుండక యుద్రేకించిన మూలచ్ఛేదంబ శాశ్వతలోకక్షేమాపాదకంబు.

దుర్యోధనాదులు జ్ఞాతిమాత్రద్రోహులే కదా యన వలదు. కైతవము సర్వదా సర్వత్రకైతవము. స్వభావము దురతిక్రమము. ఇంధనంబులఁ గాల్చువహ్ని జనంబుల

ముద్దుగొనఁడు. దుష్టస్వభావులకు సాధువేషంబు లాభసమయపర్యంతంబు. అనువుగాని వేళ నణఁగి, హితరీతి వర్తించి, రాజ్యంబు నిష్కంటకంబు గాఁగా ధర్మాధర్మవిచారములేక, స్వైరవృత్తిఁ జరించు రాజుల మన మెఱుంగమా? మన మూరకున్న దుర్యోధనుఁడు పాండవుల మోసగించి వధించు. ఈ బద్ధులవాక్యంబులే ప్రమాణంబులు. దాన నష్టపరిపంథియగు, దాన బలవదభిమానమువహించు. పదపడి యేకచ్ఛత్రాధిపత్యముఁ గాంక్షించు. అప్పుడు మనపై రాఁడని యెట్లు విశ్వసింప నగు? ఇరుగు దహించిన యాశ్రయాశుండు పొరుగు దహింపఁడని నమ్మ నగునా? నమ్ముట నీతియా? ధనలుబ్ధులు వావివరుసలు గణింతురా ? ఏకమార్గంబు ధర్మంబు విశ్వసనీయంబు కాని బహుశాఖం బధర్మంబు కాదు. దైవవశంబున మన కేదే నెడరుమూఁడిన మనవంశ రాజ్యంబులను ధర్మవర్తులు రక్షింతురు. అధర్మవర్తులు భక్షింతురు. ఇట్టిది సామాన్యకుటుంబంబులందును దృష్టంబు.

లోకక్షేమప్రశంసాగ్రహణంబున దుర్యోధనసంబంధంబున మనకుఁ గాని లోకమునకుఁ గాని, మేలు గలుగదని తెలుప నింతిదవ్వు భాషించితిఁగాని వివాహంబున ముఖ్యోద్దేశ్యంబిదిగాదు. కులశీలవయస్స్నేహంబులు పరిణయంబునకుఁ బ్రధానాంగంబులు. సుభద్రావిజయులయెడ వీనికలిమి నిర్వివాదంబు. అంతఁ దూఁయంబుకలిమి యత్యంతసమ్మోదకరంబు. అది యీవధూవరులందు దృష్టంబు స్పష్టంబు. విజయు ప్రచ్ఛన్నవేషంబు దైవికంబు. అపరప్రత్యయారోపితంబు. ఆగమనం బనురాగసూచకంబు. కన్య వంచిత యగుట కల్ల. ఎట్లన.

ఉ. మాయలు పన్నలేదు, చెడుమందుల నవ్వియుఁ బెట్ట లేదు, మం
త్రాయతశక్తిఁ గాదు, నరుఁ డంగనఁ గైవసపర్చికొంట; మో
హాయతి, శీలసంపదఁ, బరాక్రమసాహసలబ్ధకీర్తులన్
శ్రీయుత మూర్తి, సాధుగుణసిద్ధి, మహాసరసోక్తిచాతురిన్. ౧-౨౦

ఇఁక సుభద్రయో యన బుద్ధిమంతురాలు. కులాచారవేదిని. కీర్తికాంక్షిణి! సుశీలవతీశిక్షిత. స్వయంవర స్వతంత్ర. కావున

కం. క్షత్రియుఁ డని సుమనోహర, గాత్రుం డని మగనివాని గలవాఁ డనుచున్
శైత్రుం డని తనప్రేమకుఁ, బాత్రుం డని వలచి యతనిఁబడిఁ దాన చనెన్.

గదుఁడు—(ప్రవేశించి) రాజేంద్రా! సన్న్యాసిపర్ణశాలయం దీపత్రికయు సుభద్రామందిరంబున నీపటము నుండెను. (అని యిచ్చును. రాజు వానిని జూచి సభ్యుల కిచ్చును. వారుఁ జదువుదురు.)

కృ—సుభద్ర యర్జును వలచుట పరస్పరసందర్శనానంతరం బయ్యెనేని యతనిఁ గొంతయైన సందేహింపవచ్చు. గదానీతపత్రికలు సుభద్రానురాగం బేతత్పూర్వాకలితం బని చాటెడు. ఇప్పు డర్జునుఁడు నింద్యుఁడా? అర్జునానురాగం బట్టిద. ఈబద్ధులే సాక్షులు. "కలశపయోరాశి" యనుపద్యము లిఖించినది మతిహీనురాలు బాలిక యను సాహసి యెవఁడు? దాన సుభద్రకుఁ గల కన్యాత్వగౌరవబుద్ధియు నాభిజాత్యాభిమానంబును స్వీకయకుల మర్యాదాచింతయుఁ దుల్యవరాభిలాషయు లోనగునవి యెఱుఁగవచ్చు. ఆపత్రికవలన సుభద్రకు నర్జునునందుఁగల రక్తియు, దుర్యోధనునందలి విరక్తియు విశదపడెడు మన ముద్దేశించినవరుఁడు రిక్కసుఁ డట కాకోల మట "సుఖద" యనుపద్యంబున గర్భీకరింపఁబడినవాక్యము "సుయోధనదరకంపితఁ గావు వంచించి యగ్రజాతు" ననునది మనచర్యయందలి హేయబుద్ధియుఁ దెలిపెడి. 'శుభముద్ర ద్వితీయ' యనుటవలనఁ బత్రిక లిఖించినది భద్ర యని స్పష్ట మగు. అర్జునుఁ డేట్లు నింద్యుఁడు? సోదరనిశ్చితి రుక్మిణీదేవి హరణంబు స్మరణీయంబు. విజయానుష్ఠితగాంధర్వంబు క్షత్రియోచితంబు, కావునఁ బరస్పరానురాగయుక్తం బీదాంపత్యంబు ప్రశస్తతరమని నాయభిప్రాయము, అటుకాదని క్రోధంబున సాధింత మనఁ బాండవు లసులభసాధ్యులు. పాంచాలవిరాటాదిరాజ ఘటోత్కచాదిరాక్షస నాగకులేంద్రాది సహాయులు. రణం బధమోపాయంబు. సాపాయంబు. జయము శంకనీయము, నిర్జించితిమేనియు సుభద్రాపునరాయనంబు నిష్ప్రయోజనంబు.

సీ. ఒరులు ద్రావఁగఁ దక్కు♦నుదకంబు లెవ్వాఁడు, తలఁగఁ ద్రోయక తాను♦ద్రావనేర్చు?
నన్యభుక్తంబు మా♦ల్యంబుఁ దా నెవ్వాఁడు, వెండియు ముడువఁగ♦వేడ్కసేయు?
నన్యునుచ్ఛిష్ట మా♦హారంబు నెవ్వాఁడు, పరిహరింపక తిన ♦ భ్రాంతిపడును?
విధిపూర్వకంబుగఁ ♦ జెలివారు గ్రహియించి, నది మాని యేటికి ♦ నాసచేయు?

తే. నన్యునకు భార్య యైనట్టి♦కన్య నెవఁడు
మరలఁ దనభార్యగాఁ గొన ♦ మమతపడెడుఁ?

తనసతిఁ బరుండు గ్రహియింపఁ • దనకు నింపొ ?
యట్టు లితరులఁ దలపోయ • ననఘశీలి. ౧౨౨

అనన్యగతికుండు దుష్కామి గ్రహింపఁ బూనినను

చ. కులము నిహంబునుం బరముఁ • గోల్పడియొనర్చెడిసాధ్వి వల్లభుం
డిలిగిన వెండి మార్మగని • నేటికిఁ గోరుఁ? బురాకృతాఘదు
ష్ఫల మది తక్కకష్టముల•భంగి నటంచు సహించి యోర్పుమైఁ
దలఁగఁగ ద్రోయుఁ గాలము వ్ర•తంబులఁ బుణ్యదసత్క్రియాళులన్. ౧౨౩

తే. నియతిసేతువుఁ ద్రెంచెడి•నీతిలేని, కలికి మార్మగనిని గోరు•కాముక యుప
పతుల నెమకుచుఁ దిరిగెడు•వాడవది నె,కన్న వంచకురాలుగ•నెన్నఁబడును ౧౨౪

కావున రణంబు కర్తవ్యంబు గాదు. వీరి నందఱ వదలుటయు మన మింద్రప్రస్థంబున కరిగి సుభద్రావిజయులకు యథావిధి వివాహ మొనర్చుటయు మేలు.

ఉగ్ర—తక్కినవారి యభిప్రాయములు ?

వసు—కృష్ణాభిప్రాయంబున నే నేకీభవించితి.

సాత్యకి—నాయభిప్రాయ మదియ.

గ—నాయభిప్రాయ మదే.

బల—వివాహమునకు వలపు ప్రధాన మనుట నే నంగీకరించితి సుభద్రయభిప్రాయము మాత్రము నే నెఱుఁగ. ఎఱిఁగి యుండినఁ దదిష్టమునకుఁ బ్రతికూలుండనై వర్తించి దానిసౌఖ్యముఁ జెఱుప యత్నింతునా ? మన మందఱ మింద్రప్రస్థంబునకుఁ బోయి వివాహము నిర్వర్తింపవలసినదే. దుర్యోధనా ! నిన్ను వలవనిదానిఁ గట్టుకొని నీ వేమి సుఖపడఁ గలవు? కావున విచారపడకుము. ఇంతమాత్రమున మన నెయ్యము దవ్వయ్యె నని తలంపకుము. నీయం దభిమానము వదలను, నమ్ముము.

ఉగ్ర—దుర్యోధనా !

కం. వంచించువారి దైవమె, వంచించును దౌష్ట్య మెపుడుఁ • బనిసేయదు ని
ర్వంచనమతి ఋజువర్తన, మెంచుము మే లనుచు దైవ•మే శర ణనుమీ. ౧౨౫

తే. పాప మొనరింపఁ దప్పదు • పాపఫలము
శుభము లొనరించువానికి • శుభము లొదవుఁ

శాపశీలివి నీ కిట్టిపాటు గలిగెఁ
బుణ్యవంతుని విజయునిఁ ♦ బొందె శుభము. ౧౨

నీవు మాలో సమానుండవగుట మతేమియుఁ జెప్ప నొల్ల. సోదరమాతుల సమేతుండవై తగుపరివారంబుతోడఁ బురంబునకుఁ బొమ్ము. గలంఁబునకు నగవకుము. బుద్ధిమంతుండ వగుము.

దుర్యో—(స్వ) తే దైవము పాలిక్కి యనెడి తాత్పర్యమునను
బురుషకారం బొనర్చితిఁ ♦ బూర్ణముగను
వ్యర్థమై పోయె బుద్ధియుఁ ♦ బౌరుషంబు
దైవమే పర మంచును ♦ దలఁచువాఁడ.

అయినను నీవివాహము పాండవులకు దుఃఖకారణముగనే చేసెదఁగాక. (శకుని దుశ్శాసనులతోడ నిష్క్రమించెను.)

ఉగ్ర—వేషధారులారా! మీరు బ్రాహ్మణుల కపకీర్తిఁ దెచ్చుటకై యిట్టివారివేషం బులలో వర్తించెదరా? జారచోరన్యవహారంబులు చిరకాలంబు దాఁగవు సుఁడీ.

తే సుజనతతితోడి సఖ్యంబు ♦ శుభముఁ గూర్చు
దుష్టతతితోడిస్నేహంబు ♦ దుఃఖ మిచ్చును
దుష్టులరు మీరు స్నేహంబు ♦ దుష్టులోడఁ
గలిగెఁ, గంటిరె కాదె తత్ఫలము నిపుడు.

ఇఁక నైన జాడ్యంబు మాని సజ్జనసాంగత్యంబుల బ్రదుకుండు పొండు. (సుకేతబ్రాహ్మణులు నిష్క్ర.) నాగకుమారా! మీకాణిగాఁకిఁ గలపతిభక్తియు, సపత్నీజన రక్తియు, నత్యంతశ్లాఘనీయంబు. ఆయమగారి సామర్థ్యంబునఁగదా మా యుభయవంశంబులు మనియెను. యథావృత్తం బామెకు నివేదింపఁ బొమ్ము. (నాగ కుమారుఁడు-నిష్క్ర) సభ్యులారా! మన మనంతర కార్యంబునఁ బ్రవర్తింపఁ జను దము. (అందఱు నిష్క్రమింతురు.)

---

పంచమాంకము - ద్వితీయరంగము.

(ఇంద్రప్రస్థపురంబు. కుంతీద్రౌపదులు కూర్చుండియుండ సుభద్ర ప్రవేశించును)

సుభద్ర—అత్తగారికి నమస్కారము (అని మ్రొక్కును)

కుం—కల్యాణ మస్తు. ఏమమ్మా కోడలా! యెప్పుడు వచ్చితివి?

సుభద్ర—ఇప్పుడే వచ్చుచున్నదానను.

కుంతి—ఒంటరివై యెట్లు వచ్చితివి?

సుభద్ర—అర్జునవరసాహాయ్యంబు బలిమి

కుంతి—మనవారు కుశలులా?

సు—అందఱుఁ గుశలులు. అక్కగారికి నమస్కారము.(ద్రౌపదీచరణంబుల వ్రాలును)

ద్రౌ—(లేవఁ దీసి) కృష్ణసోదరి వగుట నీవు నాసోదరివే. చెల్లెలా! నీకుఁ బ్రతిపక్షవిజయుఁడు పతి యగుంగాక.

అర్జు—(ప్రవేశించి) జననికి నర్జునుఁడు నమస్కరించుచున్నాఁడు.

కుం—(అర్జునుఁ గౌఁగిలించి) నాయనా! సుఖముగ వచ్చితివా? ఎన్నికష్టములు పడితివో కదా? నీవు నాయొద్దలేనియేఁడు కల్పంబునకుఁ గదా యుండెను. కన్నులఁ గట్టుచుంటివే?

అర్జు—(ద్రౌపదితో) దేవీ! నీపలుకమోఘంబు. నా కోకవర మిమ్ము.

కుం—ద్రౌపదీ! కష్టంబు లనుభవించి యెన్నిదినంబులకో వచ్చెను ఆశాభంగముఁ గావింపకుము.

ద్రౌ—అడుగునది ప్రాణనాథుఁ డఁట. ఆమోదించునది యత్తగా రఁట. నే నేల యన్యథా యాచరింతును?

అ—ఆనాఁడు తీర్థయాత్రాప్రయాణసమయంబున "భద్రావాప్తిర" స్తటంచు నన్నంటివి. ఈనాఁడు ప్రతిపక్షవిజయుఁడు నీభర్త యని చెల్లెలి దీవించితివి. నీపలుకు యథార్థపడనిమ్ము!

ద్రౌ—నాథా! ఈమాత్రమునకు నింతదూరము వలయునా? నామన స్సెట్టిదనిచెప్పిన నిరాకరింప నంతటిధూర్తురాలనా? అవశ్యము సమ్మతించితిని.

కంచుకి—(ప్రవేశించి) దేవీ! రాజుగారువచ్చుచున్నారు. (నిష్క్రమించును)(ధర్మరాజు ప్రవేశించును. ద్రౌపదీసుభద్రలు లేచి నిలుతురు. సుభద్రార్జునులు నమస్కరింతురు.)

ధర్మ—నాయనా! సుఖముగా వచ్చితివా?
అర్జు—మీయాశీర్వచన బలమున.
కుంతి—సుభద్రను ద్వితీయంగాఁ గొనివచ్చినాఁడు.
ధర్మ—పరమ సంతోషము. ఎట్లు తెచ్చితివి?
అ—చతుశ్శాలకుఁ బోదము రండు. అక్కడ కందఱఁ బిలిపించిన సర్వముఁ దెలిపెద.
(అందఱు నిష్క్రి)

---

## పంచమాంకము - తృతీయరంగము.

(ఇంద్రప్రస్థపురము-పాండవసభామందిరము. పాండవులు, మంత్రి, దేవకీవసుదేవ బల రామ కృష్ణాదులు, రుక్మిణీసత్యభామలు సమాసీనులై యుందురు.)

ధర్మ—(బలరామునితో) బావా! మాయందు మీకుఁ గలదయకుఁ బరిమితి లేదు గదా? అర్జునున కెంతవ్వాత్సల్య మిచ్చితిరి! ఏటిబంధుభావము!
భీముఁడు—అన్నా! బంధువాత్సల్యము. విశేషించి మనయందు.
నకు—బంధువాత్సల్యము వారికి సహజగుణము.
సహ—సహజభూషణము.
బల—యుధిష్ఠిరా! ఏమీ మీవినయసంపద! ఏమి మీయందుఁ గలసద్గుణలక్ష్మి!
ఇట్టివారితో బాంధవము మాపూర్వపుణ్యఫలము.
సాత్యకి—మీవిషయంబున మాయభిప్రాయ మదే.
కృష్ణుఁడు—(ధర్మరాజుతో) బావా! జ్ఞప్తియుం దున్నాఁడనా?
ధర్మ—కృష్ణా! యింతలో వంచింపఁ జూచెదవా?

సీ. మామీఁద దయయున్న•మాధవా! యందునా, ప్రత్యక్షవిషయంబు•ప్రశ్న సేఁత
తలఁతువే మెపుడైన•జలజాక్ష! యందునా, మతిమఱ్పువాఁడ వ•మతము సేఁత
మాకష్టసుఖములు • మది నెఱుంగుదె యన్న, సర్వజ్ఞ శక్తిని • శంక సేఁత
నీభక్తులము మేము • నిజముగా నందునా, నతరక్షకా! యహం•మతిని సేఁత
తే. దేవ! మీవార మనుచును • దెలిపికొనుట
కంజలోచన! యది యిచ్ఛ•కంబు సేఁత

నిర్జరారాధ్యుఁడవు రుక్మిణీప్రాణేశ!
యే మటంచును బ్రశ్నింతు నో మహాత్మ!

కృష్ణుఁడు—బావా! నీధర్మమే నిన్ను సర్వావస్థలఁ గాచును.

గదుఁడు—అర్జునా! ఆనాఁడు కాగితపుఁబటము నా కేల యంటివే దాని నిచ్చెదవా?

అ—(కౌఁగిలించుకొని) నా నిర్లక్ష్యభావము సహింపుము. అర్చావతారంబు భక్తునకు మోక్షలక్ష్మినింబోలె నీపటము నాకీయర్ధాంగలక్ష్మిని సంఘటించె ఉద్దేశంబు భేదంబగాని సాధకమార్గం బొక్కటియ కదా యని యెన్నిమాఱులో స్మరించితి, సాయుజ్యంబు నీయాచార్యకంబున లభించె.

బల—కృష్ణా! మనము వచ్చినకార్యము?

కృ—(ధర్మరాజుతో) బావా! సుభద్రను బిలిపింపుము. సుభద్రావిజయకళ్యాణోత్సవము నెఱవేర్పఁ బెద్దలు నిశ్చయించిరి.

ధర్మ—పరమసంతోషము. మంత్రీ! యీవార్త నంతిపురంబునఁ దెలుపుము (మంత్రి నిష్క్రమి. సుభద్రాద్రౌపదులు ప్రవేశింతురు.)

వసు—ధర్మజా! కన్యాదానమున కనుజ్ఞ యిచ్చెదరా?

ధర్మ—దానము దాతృవశము.

వసు—సుభద్రా! రమ్ము (అని చేయి పట్టుకొని) అర్జునా!

కం. ఈకన్నియ నాకూఁతురు, పాకారితనూజ! ధర్మపత్నిగ దీనిన్
నీ కొసఁగితి సహకారిణిఁ, బ్రాకటగతిని గ్రహింపు పాణిం బాణిన్.

(సుభద్రచేతి నర్జునుఁడు పట్టుకొనును.)

దేవకి—(సుభద్రం జూచి) కూఁతురా!

చం. కులముఁ దలంపుమీ, గురులఁ గొల్వుమి, శీలము మర్వఁబోకుమీ
మెలమిని సేవకావళుల నెప్పుడుఁ బ్రోవు దయార్ద్రచిత్తవై
కలహముపొంతఁ బోవకుము కాంతుఁ డవజ్ఞ నొనర్చె నేనియున్
దెలియనిదానవై మెలఁగి తెమ్ము యశంబును మాకు వారికిన్. ౧౩౧

చం. లలనరొ! యాఁడుజన్మముఁ దలంపుము లేయరఁటాకుపోలికన్
మెలఁకువతోఁ జరింపు, మెఱమెచ్చుల కేపనిఁ జేయఁబోకుమీ

నిలువుమి పేరు పెంపెవరు వ్రేలను ♦ నిన్నెటు జూపకుండఁగా
మెలఁగు సమానలందుఁ గడు♦మిన్నవయై గుణపాళిఁ బుత్రికా. ౧౩౨

కం. ఎట్టిదశయందు నున్నను, బట్టీ! దైవంబు సతికిఁ ♦ బ్రాణేశ్వరుఁడే
యిట్టట్టు లాడ కతనికి, నెట్టన విభుసౌఖ్య మెంచు ♦ నిజసౌఖ్యముగన్. ౧౩౩

(సుభద్రార్జునులకు రుక్మిణీసత్యాద్రౌపదులు మంగళారాత్రికలు పాడుదురు.)

కృష్ణుఁడు—అర్జునా! యిపు డింకేమి కోరెదవు?

అర్జు—ఇంతకన్న నాకేమికావలయును. అయినను

భరతవాక్యము.

చం. కుదురునుగాక భూపతుల♦కుం జనరక్షయు ధర్మబుద్ధియుం
బొదలునుగాక యాంధ్రులకుఁ ♦ బూతనిజోక్తిమతాభిమానముల్
జెదరునుగాక దుష్టులకు♦ చేష్టితముల్ శకలీకృతంబులై
వదలక యుండుఁగాక హరి♦భక్తి జనంబుల నెల్లవేళలన్.

కృష్ణుఁడు—తథాస్తు. (అందఱు నిష్క్రమింతురు.)

స్వస్త్యస్తు.

శ్రీరామచంద్రార్పణమస్తు.



Solden & Co., Madras, S. E.

బ్రహ్మశ్రీ వావిలికొలను సుబ్బరావుగారు
విద్యాన్నదాన కైంకర్యములకుఁగాను శ్రీమదొంటిమిట్ట
కోదండరామస్వాములవారికి సర్వస్వాతంత్ర్యములతో సమర్పించిన

# పుస్తకముల పట్టి.

---

దీనిని గొని చదువువారు చదివించువారు తాము లెస్సబాలురు బాగుపడుట యేగాక భగవద్ధర్మకార్యమునకు సహాయపడిన పుణ్యమార్జింతురు.

౧. శ్రీమదాంధ్ర వాల్మీకిరామాయణము ౪-వ కూర్పు -

| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| | లఘుటీకతోడ మొదటి సంపుటము కాలికోబైండు ... | 4 | 0 | 0 |
| | ,, రెండవ సంపుటము ... ... | 4 | 0 | 0 |
| | సుందరకాండము ... ... ... ... | 1 | 0 | 0 |
| ౨ | శ్రీకృష్ణలీలామృతము, (వచనకావ్యము) ౧-వ భాగము | 1 | 12 | 0 |
| | ,, ,, ౨-వ ,, | 2 | 4 | 0 |
| | ,, ,, ౩-వ ,, | 2 | 0 | 0 |
| | శ్రీకృష్ణావతారతత్త్వమంతయుఁ బ్రత్యేకపీఠికగాఁగల ౪-వ భాగము | 2 | 4 | 0 |

(ఇది నూతన వచన మహాగ్రంథము. నానా పురాణేతిహాసములఁ గల కృష్ణచర్య యిందు సమకూర్పఁబడినది, సమస్తాంధ్ర స్త్రీ పురుషులకు నవశ్య పఠనీయము. ఇందుఁ జిత్రపటములు గలవు. పై నాలుగు భాగముల నొక్కమారుగ కొనువారికి అట్టబైండుతో రూ- 7-8-0 నకే ఇయ్యఁబడును. కాలికోబైండుతో 2 సంపుటములుగ గట్టుఁబడినవి బంగారు పేరుతో గలవి. 8-0-0.

| | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|
| ౩. | శ్రీకుమారాభ్యుదయము, ౨-వ కూర్పు (రంగుకాగితము) | 1 | 0 | 0 |
| ౪. | సుమనోల్లాసము, పై దానికి టీక (పునర్ముద్రణముకావలెను) | | | |
| ౫. | శ్రీకౌసల్యాపరిణయము, ౨-వ కూర్పు పెద్దయక్షరములు | | | |
| | ,, (నిండుకాలికో) ... | 1 | 4 | 0 |
| ౬. | † సుభద్రావిజయము, ౩-వ కూర్పు (నిండుకాలికో) ... | 1 | 4 | 0 |
| ౭. | కౌసల్యాపరిణయము టీక ప్రథమాశ్వాసము ... ... | 0 | 12 | 0 |
| | కౌసల్యాపరిణయముతోడఁ దీసికొనిన ... ... | 0 | 6 | 0 |

---

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| ౮. బమ్మెర పోతన నికేతనచర్య ... ... ... | 1 | 0 | 0 |
| ౯. బమ్మెర పోతరాజ విజయము ... ... ... | 0 | 12 | 0 |

*N. B.*—8-9 ఈ రెండును గ్రంథాలయులవారికి 0-14-0 కియ్యఁబడును.

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| ౧౦. బమ్మెర పోతన గీతములు, రామనుతి, కృష్ణనుతి ... | 0 | 1 | 0 |
| ౧౧. ఇవి టీకతోడఁ గలసిన నుతిత్రయము ... ... | 0 | 4 | 0 |
| ౧౨. బమ్మెర పోతన రత్నములు, (కాలికో, మూఁడవకూర్పు) ... | 0 | 12 | 0 |

భాగవతములోని మంచిపద్యము లన్నియు నేతి భక్తి, నీతి, స్తుతి, వైరాగ్యాదులు తరగతులుగా విభజించి కూర్పఁబడినవి. 500 కెక్కువపద్యములు గలవు. ప్రత్యాంధ్రుఁడును నుదయముఁ జదువఁదగినది.)

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| ౧౩. శ్రీ కాళహస్తిమాహాత్మ్యము (ధూర్జటికవి ప్రణీతము) రెండవకూర్పు | | | |
| ,, (సగము కాలికో) ... | 1 | 0 | 0 |
| ౧౪. భీమఖండము (శ్రీనాథ ప్రణీతము) (సగముకాలికో) ... | 1 | 0 | 0 |
| ౧౫. †సులభవ్యాకరణము ౭-వ కూర్పు ౧-వ భాగము ... | 0 | 11 | 0 |
| † ,, 3-వ ,, ౨-వ ,, ... | 0 | 12 | 0 |
| † ,, 3-వ ,, 3-వ ,, ... | 0 | 9 | 0 |
| ౧౬. †ఆర్యకథానిధి ౧-వ భాగము (నిడుకాలికో) ... ... | 0 | 4 | 0 |
| † ,, ౨-వ ,, ,, ... ... | 0 | 4 | 0 |
| † ,, 3-వ ,, ,, ... ... | 0 | 4 | .0 |
| † ,, ౪-వ ,, ,, ... ... | 0 | 4 | 0 |
| † ,, ౫-వ ,, ,, ... ... | 0 | 5 | 0 |
| † ,, ౬-వ ,, ,, ... ... | 0 | 5 | 0 |
| ,, ౭-వ ,, ,, ... ... | 0 | 4 | 0 |
| ,, ౮-వ ,, ,, ... ... | 0 | 5 | 0 |
| ౧౭ ఆర్యచరిత్రరత్నావళీ మాలికా గ్రంథములు | | | |
| †హరిశ్చంద్ర చరిత్రము (నిండుకాలికో) ... ... | 0 | 5 | 0 |
| †శకుంతల ,, ,, ... ... ... | 0 | 5 | 0 |
| †నల ,, ,, ... ... ... | 0 | 7 | 0 |

శ్రీరామజయమందిరము. నెం. 21. రాజాహనుమంతలాలావీథి, తిరువళిక్కేణి, మదరాసు.

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| †సావిత్రి ,, ,, ... ... | 0 | 5 | 0 |
| భగవద్గీత ద్విపద ,, ,, ... ... | 0 | 8 | 0 |
| †హనుమంతునిచరిత్రము, ౧-వ భాగము, నిండుకాలికో ... | 0 | 7 | 0 |
| ,, ౨-వ ,, ... ... | 0 | 7 | 0 |
| † సీతాదేవిచరిత్రము ౧-వ ,, ... ... | 0 | 7 | 0 |
| † ,, ౨-వ ,, ... ... | 0 | 7 | 0 |
| † ,, ౩-వ ,, ... ... | 0 | 7 | 0 |
| రుక్మాంగదచరిత్రము (నిండుకాలికో) ... ... | 0 | 7 | 0 |
| వామనచరిత్రము ... ... ... | 0 | 5 | 0 |
| ౧౮. హితచర్యామాలికా గ్రంథములు. | | | |
| బాలక హితచర్య (౩౧౧ పుటలు) (నిండుకాలికో) ... | 0 | 9 | 0 |
| కుమార హితచర్య ,, ... | 0 | 9 | 0 |
| పతి హితచర్య ,, ... | 0 | 11 | 0 |
| †కుమారీ హితచర్య ,, ... | 0 | 5 | 0 |
| సతీ హితచర్య ,, ... | 0 | 8 | 0 |
| గర్భిణీ హితచర్య ,, ... | 0 | 10 | 0 |
| వైధవ్యధర్మచర్య ,, ... | 0 | 8 | 0 |
| ౧౯. కుమారదండకము (శోకరసము) ... | 0 | 1 | 0 |
| ౨౦. ఆధునికవచనరచనవిమర్శనము, గ్రామ్యవాదఖండనము ... | 0 | 1 | 0 |
| ౨౧. ఒంటిమిట్ట రఘువీరశతకము ... | 0 | 4 | 0 |
| ౨౨. తల్పగిరి రంగనాయకశతకము ... | 0 | 2 | 0 |
| ౨౩ ఆర్యవిద్యోపన్యాసము, (జాతీయ విద్యాభ్యాసపద్ధతులనుగురించి) | 0 | 4 | 0 |
| ౨౪ అస్పృశ్యత ... | 0 | 4 | 0 |
| భక్తిప్రసూనమాలికా గ్రంథములు. | | | |
| ౨౫. శ్రీ రామనామమాహాత్మ్యము ... | 0 | 4 | 0 |
| ౨౬ ఒంటిమిట్ట కోదండరామమాహాత్మ్యమను రామదాసులచరిత్రము (కాగితము కవర్) ... ... | 0 | 10 | 0 |
| ౨౭ భక్తనిత్యచర్య ప్రథమసోపానము ... ... | 0 | 2 | 0 |

| | | | రూ. | అ. | పై. |
|---|---|---|---|---|---|
| ౨౮. ,, ద్వితీయసోపానము | ... | ... | 0 | 4 | 0 |
| ౨౯. ,, తృతీయసోపానము | ... | ... | 0 | 4 | 0 |
| 30. సుప్రబోధము-మేలుకొలుపు ... | ... | ... | 0 | 4 | 0 |
| 3౧. రామపరత్వము ... | ... | ... | 0 | 4 | 0 |
| 3౨. సీతోపదేశము ... | ... | ... | 0 | 4 | 0 |
| 33. హనుమదాచార్యోపదేశము ... | ... | ... | 0 | 4 | 0 |
| 3౪. భక్తిప్రాశస్త్యము ... | ... | ... | 0 | 4 | 0 |
| 3౫. దేవాలయతత్త్వము ... | ... | ... | 0 | 12 | 0 |
| 3౬. ఒంటొరాయచిప్పశతకము ... | ... | ... | 0 | 4 | 0 |
| 3౭. ,, సపేషము.... | .... | .... | 0 | 3 | 0 |

† ఈ గుర్తువేసినది టెక్స్టుబుక్కు కమిటీవారివల్ల నంగీకరింపఁబడినది

పుస్తకములు వలయువారు —

(౧) శ్రీరామజయమందిరము. నెం ౨౧. రాజా హనుమంతలాలావీధి,
తిరువళిక్కేణి, (మదరాసు.)

(౨) శ్రీరామసేవాకుటీరము, ఒంటిమిట్ట. (కడప జిల్లా)

(3) ఎం. పి శర్మ. ఆంధ్రగ్రంథాలయము. నెల్లూరు.

వీరిలో నెవరికైనను వ్రాసి తెప్పించుకొనవలయును.

ఆంధ్రవాల్మీకి రామాయణమునకు వ్యాఖ్యానము గోరువారును, ఆర్యధర్మవర్ధనీపరీక్షల విషయమై తెలియఁగోరువారును పైవారికి వ్రాయవలయును.

---

శ్రీ రామజయమందిరము, నెం. 21, రాజాహనుమంతలాలావీధి, తిరువళిక్కేణి, మదరాసు.